శ్రీరస్తు.

# శ్రీ సూక్తివసుప్రకాశకము

ఇది

ప్రస్తుతము రాజమహేంద్రవరంబున

దొరతనమువారి మొదటితరగతి కళాశాలయందు

నాంధ్రోపాధ్యాయుఁడగు

వడ్డాది సుబ్బారాయని చేత

రచియింపఁబడెను.



నాలుగవ కూర్పు ప్రతులు 2000.

రాజమహేంద్రపురము.

శ్రీ మనోరమా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

౧౯౧౨.

 [దీని వెల

# అభిజ్ఞానశాకుంతలము

వసురాయకవిరచితము.

———:(0):———

ఇది కాళిదాసమహాకవివిరచిత మయినసుప్రసిద్ధసంస్కృతనాటకరాజమునకుఁ దెలుఁగు. ఇందు మూలానుగుణము లయిన గద్యపద్యములు మాత్రమే కాక పెక్కుతావుల గూఢములయి యున్నసరసభావములు, రసికజనమనోరంజకములుగా లఘుటీకను సవిమర్శముగా విశదీకృతము లయి యున్నవి. సావధానముగాఁ జదువువారి కీగ్రంథము మూలములోని యనేకసారస్యములను గ్రహించుటకు మేలిసాధన మగు ననుట యతిశయోక్తి గాదు. శైలిఁదెలియుట కీక్రిందఁ గొన్నిపద్యము లుదాహరింపఁబడుచున్నవి.

దీని వెల రు 1—0—0 మాత్రమే.

ఉ. ఏయకు మేయ కౌవిశిఖ మీసుకుమారపుజింకమేనిపైఁ;
ద్రోయఁగ వచ్చునయ్య తూలపుంగుమిమీఁదను వీతిహోత్రమున్?
హా! యతిలోల మాహరిణకావళిజీవిత మేడ? నేడ నీ
సాయకముల్ నిశాతఫలసంకలితంబులు సారపుంఖముల్?

ఉ. వ్రాసి పటంబులోన విధి ప్రాణము వోసెనొ? మానసంబునన్
జేసెనొ రూపసంచయము చేతను? గాదటు; వేధశిల్పవి
న్యాసవిభుత్వముఁ, గలికియంతక స్రష్టవ మింత చింతనం
జేసినఁ, గన్య యన్యవిధిస్త్రీమణిసృష్టి యటంచుఁ దోఁచెడున్.

చ. శ్రమము హరింపఁగాఁ దగినచల్లనితామరపాకుఁదాళవృం
తములను నార్ద్రవాయుచలనం బొలయన్ మెలమెల్ల వీతునా?
నిముసము, పద్మతామ్రములు నీయడుగుల్ గదియించి మామకాం
కముపయి, నీకు నొట్టులు సుఖం బటు పట్టుదునా వరోరువా?

చ. పలుకు నరేశ్వరుం డెటులు, వాస్తవ మట్టుల యైతి వేనియుం,
గులమునపాడికిం జెడినకూఁతుర వేటికి నీవు తండ్రికిన్?
జలఁగదు నైజశుద్ధచరితం బని నిక్క మెఱింగి యుంటివా,
నిలు పతియింట దాసిగ నేనియుఁ; నీ కది చాల మేలగున్.

# విషయసూచిక.


| విషయము. ప్రథమభాగము | | పుట | విషయములు. ద్వితీయభాగము | | పుట |
|---|---|---|---|---|---|
| గురుశిక్ష | ... | 1 | ప్రయోజకత్వము | | 35 |
| వినయము | ... | 2 | కామము | ... | 36 |
| గుణవంతుఁడు | ... | 4 | క్రోధము | ... | 37 |
| శ్రద్ధ | ... | 6 | ఆశ | ... | 38 |
| బుద్ధి | ... | 6 | జుగుప్స | ... | 39 |
| కాలము | ... | 8 | ఈర్ష్య | ... | 39 |
| ఉద్యోగము | ... | 9 | తొందర | ... | 40 |
| విద్య | ... | 11 | శాంతత్వము | ... | 41 |
| విమర్శనము | ... | 15 | ధైర్యము | ... | 42 |
| హితోపదేశము | ... | 17 | ప్రతాపము | ... | 43 |
| వివేకము | ... | 18 | ఘనుఁడు | ... | 45 |
| సంభాషణము | ... | 19 | దుర్జనుఁడు | ... | 46 |
| కొండెము | ... | 21 | ఆపత్సంపదలు | ... | 48 |
| అతిపరిచయము | | 22 | ధనము | ... | 51 |
| స్నేహము | ... | 23 | దాతృత్వము | ... | 53 |
| ఐకమత్యము | ... | 25 | ఋణము | ... | 55 |
| స్నేహితుఁడు | ... | 26 | లోభిత్వము | ... | 56 |
| పరోపకారము | ... | 29 | ఆశ్రయము | ... | 57 |
| భూతదయ | ... | 30 | రాజు | | |
| బాంధవము | ... | 31 | నియంత | | |
| మాతృవాత్సల్యము | | 32 | సేవకుఁడు | | |
| సంతానము | ... | 33 | | | |

దోఁచిన కిప్పు డేను దోడొనర్చెదుకృతి
దానికన్న మహిమ పూన వలయు.

తే. గీ. సకలసద్వ్యోత్తరార్థలౌకికనిదర్శ
నములు పూర్వార్థములకుఁ బ్రాణములు గాఁగఁ,
జంపకోత్పలములను బుస్తక మొనర్తు,
జగతి సూక్తివసుప్రకాశిక మనంగ, 5

సీ. భువనజాతంబు లామోదపూర్ణములుగా దినము తప్పక ప్రోచుదేవుఁ డెవఁడు
సకలస్థలములందు సర్వజీవులు జీవనముఁ బొంద ఘనకారణం బెవండు।
దానిశ్చలుండయి మానితాజాండభాండములకుఁ జలనంబొనర్చు నెవఁడు।
గురుతమోవృతజంతుకోటికి వెండి చైతన్య మిచ్చెదుజగత్ప్రభుఁ డెవఁడు

తే. గీ. పరమతేజస్స్వరూపుఁ డై ప్రబలు నెవ్వఁ
డురువిపద్ధ్వాంత మడఁచు నేర్పరి యెవండు
సతత మఖిలజగచ్ఛ్రీహితుఁ డతండె
యగుట, నమ్మితు నీన కొనర్తు నంకితంబు. 6

క. ఒక్కొక్కటి తొంటి దైనను।
టెక్కులు దృష్టాంతములు నవీనములే యిం
దెక్కడ లోపము గల్గిన
నక్కడ సున్నింపఁ గొలుతు నార్యుల నెల్లన్. 7

క. అక్కటికముతోఁ దెలుపుఁడు
నిక్కపుదోషంబు, మీకు నేఁ గేల్మొగుతున్;
దక్కరితప్పులు పట్టిన
నక్కట! మీవాక్క పరుష మగుఁ గవులారా. 8

శ॥ సు॥

# పీఠిక.

మనభాషలో మహాకవు లనేకులు విరచించినబహు ప్రబంధములు ప్రాయికముగా శృంగారరసప్రధానము లగుటం జేసి, బాల్యంబున విద్యాభ్యాసంబు సేయుఁ గోరువారల కవి యనుపయుక్తంబు లగు చున్నవి. అయినను సకలనీతిబోధకంబులు, మనోహరకథాకలితంబులు లలితమృదుమధుర పదంబులు నగుభారతాది కావ్యంబులు పెక్కు లున్నవి గాని, యవి ధ్వనిప్రధానంబు లగుటచే వానియందలిభావము లభ్యాసదశయందు గ్రహించుట యంతసులభముగాఁ గనుపట్టదు. మఱియు నాభారతాదికావ్యంబులు చదువునప్పు డనేకులు కథయంచే గాని యవి యుపదేశించునీతివిషయమున శ్రద్ధాళువులు గాకుండుట ప్రసిద్ధమే కదా? కాఁబట్టి తత్తద్గ్రంథములు పండితులకుం గాని పామరుల కంత యుపకారకరంబులుగావు. అయినను గొందఱు బుద్ధిమంతులు వానిలోనినీతిపద్యంబు లేర్చి కూర్చి నామాంతరం బిడి గ్రంథరూపంబునఁ బ్రకటించిరి గాని యవి లక్ష్యము గనఁబడినప్పుడు సంతోషము గలిగింపఁజాలినవిగా నున్నవి. లక్ష్యసమన్వితంబు లయినగ్రంథంబులు గూడఁ గొన్ని యున్నవి. అయిన నాలక్ష్యంబులు గలుచు పురాణగాథ లగుటచే, నిప్పటివారికి వానియందు

నమ్మకము తక్కువ గనుక నవి విధిలేక చదువవలసినవా రగుచున్నారు. అట్లని వానికాగ్రంథములయం దనూయాదు లెంతమాత్రమును లేవు. వానిలో నక్కడక్కడఁ గనుపట్టు ననురూపలౌకికసాదృశ్యముల కానందపారవశ్యము నొంది కృతికర్తల శ్లాఘించు చుందురు. ఈమొద లగుననేకాంశ ములఁ బలుమారు గనిపెట్టుటచేతఁ బ్రతిపద్యమును లోకదృ ష్టాంతసమన్వితంబుగా నుండు నీతిబోధకగ్రంథ మొకటి మన యాంధ్రభాషలో నుండిన విద్యార్థుల కత్యంతోపయుక్తముగా నుండును గదా యనియూహించి, మదీయసామర్థ్యం బంతకుఁ జాల కున్నను, సర్వేశ్వరుఁడు నిర్మించినప్రపంచ మనుమహా గ్రంథము విస్పష్టముగాఁ గన్నులయెదుటఁ బొడకట్టుచుంటంబట్టి దానిసాహాయ్యమున నామనోరథము నెఱవేఱ వచ్చు నని యుత్సహించి, పరమాత్మునిపయి భారమువయిచి యేతద్గ్రంథ రచన కారంభించితిని. కుశాగ్రబుద్ధులు, కూలంకషప్రజ్ఞులు నగుకవివర్యు లనేకు లుండ నాయట్టియసమర్థు నిట్టికార్యము నకుఁ బ్రేరించినయీశ్వరునికారుణ్యమహిమల నేమని కొని యాడుదును? వానిపాదారవిందముల కానందముతో వంద నంబులు సలిపెదను.

29—7—15

వడ్డాది సుబ్బారాయఁడు.

రాజమహేంద్రవరము.

# PREFACE.

—o—

As almost all the works of our poets treat of the subject of love, they cannot be read by beginners with much profit to them. There are however some works in our language such as the Mahabharata which contain many moral stories. The real sense those are intended to convey lies so deep that the reader whose mind is mostly occupied with the story, connot arrive at it. They are, therefore, not of much use to the beginner. To supply this want, selections of moral verses from standard works, have been published. But they have not succeeded in their aim, as a truth cannot be well impressed upon the youthful mind, unless it is accompained with happy illustration. Some works there are where apt illustrations are given, but most of them being taken from Puranic stories not blieved as true by the present age, they do not command as much success as works of the sort deserve. Thinking, therefore, that a work, where every truth it teaches, is illustrated by examples from nature, will be of utmost use to students, I have undertaken the present work.

If the study of this work can open to students, the hidden treasures of the book of nature and instruct them while giving them delight at the same time, I will have attained my reward.

In conclusion, I have to offer many thanks to the Rev. F. S. DIETRICH, M.A. for his having kindly assisted me in getting this book printed.

RAJAHMUNDRY.
r 20/1884. } V. SUBBARAYUDU.

# నాలుగవకూర్పు పీఠిక.

—o—

పౌరాణిక గాథోదాహరణసమన్వితంబు గాక లౌకికదృష్టాంతసారమయిన నీతిబోధకపద్యగ్రంథ మొకటి యుండిన నీకాలమునకు మిక్కిలి యుపయుక్తముగా నుండునని సకారణముగాఁ బ్రథమపీఠికయందు నేను వివరించితిని. ఆంధ్రదేశమందలి దీనివ్యాప్తి నిబట్టి తత్పీఠికను నేనువ్రాసిన యంశములు యథార్థములే యని దృఢనిశ్చయము నాకుఁ గలిగినది. సర్వకళాశాలాధికారులు 1892, 1893 సంవత్సరములయందు వరుసగా దీని ప్రథమ ద్వితీయ భాగములుగా నిర్ణయించిరి. మఱియుఁ గలకత్తా ప్రెసిడెన్సీలోఁ బ్రవేశపరీక్షకుఁ బోవఁ దలఁచి తెలుఁగు దేశభాషగాఁ గయికొను వారికి నిదియే పఠనీయగ్రంథమయినట్లు తత్తద్విద్యార్థులు పుస్తకముల కొఱకు వ్రాసినయుత్తరములవలనఁ దెలియ వచ్చినది. శ్రీడైరక్టరుదొరవారయిదవఫారమున క్లైచ్ఛికపఠనీయపుస్తకముగా 1893 సంవత్సరమున గెజటీలో దీనిని బ్రకటించి యున్నారు. ప్రస్తుతము మరల నీ గ్రంథములోని కొంతభాగము నాలవఫారమునకు నిర్బంధపఠనీయముగా నిర్ణీతమయినట్టుబు 1917 వ సంవత్సరము జూలై మొదటివారములో నాకు నెఱుకపఱిచిరని ప్రకటించుటకు సంతసించుచున్నాను. ఇట్లు బహువిధముల దొరతనము వారిచే నాదరింపఁబడుటయే గాక జనసామాన్యముచేతఁ గూడ నీపొత్తము విశేష సమ్మానమును గాంచుచున్నది దీనిపయి మంచియభిప్రాయము గలిగి యనేకులు వ్రాసిన యుత్తరములు పెక్కులున్నవి గాని, యవి యిందుఁ బ్రకటించుట యనావశ్యకము. మొదటికూర్పునందలి పద్యములలో నక్కడక్కడ దోషములు దొలంచుటకును గుణముల హెచ్చించుటకును నాకుఁ దోఁచినవిధమున నీతూరి కొన్నిమార్పులు చేసి యున్నాను. ఇంకను దీని యందనేక లోపము లుండ వచ్చును. వానిని గూడ నౌచితి ననుసరించి మఱియొక కూర్పున నేను సవరించుకొనుటకుఁ దమకు గోచరించినవి దయతో నాకుఁ దెలుపవలయునని విద్వన్మిత్రుల వందనపూర్వకము గా వేఁడుకొనుచున్నాను.

20-7-1917
రాజమహేంద్రవరము.

విధేయుఁడు,
వడ్డాది సుబ్బారాయుఁడు

# PREFA E TO THE FOURTH EDITION.

The encouragement that was given to me both by the Director of public Instruction, Madras, who approved of the use of this volume as a suitable Text Book for the V. Form and by the Madras university who selected the first and second portions of this book for the Matriculation Examination in the years 1892 & 1893 respectively as also the patronage that was extended to me by the public, who wrote to me frequently in token of their high appreciation of this Volume, have induced me to bring out this edition. There was also some demand for these books from outside the Presidency from which I am led to conclude that the book was also prescribed as Text Book in Telugu for the Entrance Candidates of the sister universities. The Director has preserided it for V Form in 1893. Now I am glad to hear that it has been again approved as Cumpulsory Text for IV Form this year. I have made some additions and improvements to the first edition that the public and the Educational authorities will continue to treat this also kindly as they had done the one before. Any suggestions for improvement will thankfully be received by the author and the necessary corrections, if any will be made in the next edition.

Rajahmundry.
20th July 1917.

V. SUBBARAYADU.

శ్రీరస్తు.

# శ్రీ సూక్తివసుప్రకాశకము.

## ప్రథమభాగము.

---

### గురుశిక్ష.

శ్రీయుతసత్ప్రవర్తనముఁ జెందక స్వేచ్ఛఁ జరించు బిడ్డ, లేఁ
బ్రాయమునందు శిక్ష ఋజుపద్ధతి నేర్పమి ; ముందు శక్యమే ?
కాయలు పొట్లతీఁగలను గల్గుకు జాలను గట్ట కుండినన్,
వేయి జనించు వంకరలు ; వెన్కను దీర్పఁ దరంబె ? మిత్రుఁడా!

ఉ. జ్ఞానసముద్భవంబునకుఁ గారణ మొక్కటి యుండఁగా వలెం;
గాని విమోహ ముప్పతిలఁ గారణ మక్కఱ లేద దెట్లనన్,
భానుఁడొ శీతభానుఁడొ నభంబునఁ దోఁపక వెల్గు గల్గునే ?
తానుగ సంభవించుఁ గద దట్టపుఁజీఁకటి ? చూడు మిత్రుఁడా.

ఉ. శిక్షితులైనవారలు విశేషబహూకృతి గాంతు రెందు ; ని
ర్లక్షితులై పరాభవపరంపర వేఁగెద రెందు దశిక్షితుల్ ;
తక్షకుచేతఁ జెక్కఁబడుదారుశిలల్ ప్రణుతు ల్వహించుఁ ; బ్ర
త్యక్షము చూడు, చెక్కనివి యావములోఁ బడి కాలు ; మిత్రుఁడా. 3

ఉ. వేమఱు శిక్షమీఁద నె వివేకద మక్షర మంటుఁ; గాని గా
ఱామునఁ జేసి దుర్గుణపరంపర దక్కువ అంట దద్దియున్ ;
భూమిని బెల్లు దప్పియు నిరుమ్మరుఁ దున్నినఁ గాక, మొండ్ల చె
ట్లే మొలకెత్తుఁ, గాని మఱి యెట్టులు ధాన్యము లంటు? మిత్రుఁడా.

ఉ. ప్రేముడి పెద్ద యుండినను, బెట్టుట పోయుట యొప్పుఁ; గాని గా
రామున బిడ్డలన్ విడువ రాదు సుమీ మతి దోష మండినన్;
గోమునఁ బెంచునంగ మనకుం గుఱు పొక్కుడ సంభవించినన్;
దా మహి వెజ్జు, శస్త్రమున దానిఁ గుదుర్పక యున్నె? మిత్రుఁడా.

చ. క్షితిపయిఁ జిన్నబిడ్డలకుఁ జెడ్డగుణం బలవడ్డ, దాన నా
వెత, మును గన్నవారలది; వెన్కను వారల దౌను; గొల్లఁ డు
ద్యతగతిఁ గొట్టు గట్టినను, నాఁగక పాల్గుడువంగఁ బోవ, ముం
దతిపరితాప మావులది; యావలఁ గ్రేపుల దౌను; మిత్రుఁడా. ౬

ఉ. శిక్ష యొనర్చి యక్షరము చెప్పి ప్రయోజకుఁ జేయ నొజ్జ నే
దక్షుఁడ నైతి నంచుఁ గడు దా నవమాన మొనర్చుఁ గూళ; ప్ర
త్యక్షము, కొల్మిఁ గాల్చి పెనుదాకట సమ్మెటఁ గొట్టు కమ్మరిన్
రూక్షకృపాణమై యినుము త్రుళ్ళుచుఁ గోయుట లేదె? మిత్రుఁడా.

చ. అవగుణముల్ తమంత హృదయంబున నుద్భవ మొందు; ముందు గా
నవి యడఁగింప కున్న, నొక టైనను నాటదు సద్గుణంబు; ని
క్కువ మిది; పిల్లు పల్లెరును గొబ్బి యు నాదిగ నున్నబీటిలో
వివిధము లైనధాన్యములు విత్తిన నంటు నటయ్యె? మిత్రుఁడా. ౮

---

## వినయము.

చ. గురుజనశిక్షఁ దాఁ గుదురుకొల్పు గుణంబు; గుణంబుచే మనో
హరవినయంబు గల్గు; వినయంబున నే సఫలప్రయత్నుఁడౌ;
నరయఁగ విల్లుకాఁడు గవయంబున మేల్గొనయంబు గూర్పఁ, సం
గరమున వంగి సింగిణులు గాఁచుట లేదె జయంబు? మిత్రుఁడా. ౯

చ. నిలుపఁగ రానిగర్వమున నిక్కుచు నుండినఁ గీడు మూఁడెడుం;
బొలుపుగ నమ్రభావమును బూని చరించినఁ జాల మే లగున్;

బలమున విఱ్ఱవీఁగుచు దయపాళి గుబాలున నేలఁ గూలెనుఁ;
దలఁపను వంచకవృత్తులు త్రాసము నొందదు గాదె? మిత్రుఁడా. 10

ఉ. ఏమి యు లేనివా రె మహి నెక్కుడు నిక్కుచు నుండ్రు; పూర్ణులు
ద్దామత నందఱుం బొగడఁ దద్దయుఁ బూన రె నమ్రభావ? మా
రామమునందు మ్రోడు పెనుమ్రాఁకులు నాకమువంకఁ జూచెడున్;
భూమికి వంగుఁ బత్రఫలపుష్పయుతావనిజాళి; మిత్రుఁడా.

చ. దళసరి చూపఁ గల్గి మను దగ్గుట నైజము గొప్పవారికిన్;
దొలుత నె త్రుళ్ళిత్రుళ్ళి తుదిఁ ద్రుంగుట నైజము కొద్దివారికిన్;
వెలియలకట్ట దాటుటకు సింధువు వెక్కసుఁ బోవు నుంచు; తా
నలజడి హెచ్చ వచ్చి యును గంటుకు వెంట నె వాఁగు; మిత్రుఁడా.

చ. సిరి గల దంచు లేవడిని జెందినవారిని నవ్వఁ గూడ; ద
వ్వరి కది శాశ్వతంబు? తమ వారు ను నొక్కప్పుడట్లు నవ్వ రే?
పరమునఁ బద్మినుల్ పగలు జబ్బగు కైరవిణిన్ హసించినన్,
మరలను బక్కవన్నగదె మాపటి వానిని జూచి? మిత్రుఁడా. 13

చ. వయమున నెంతవాని వయినన్ సులభంబుగఁ గొంగఁ దీయ నౌ;
భయమున నట్లు చేయుటకు బ్రహ్మకు నైనను దుర్లభంబు; పా
దరయఁగను పట్టుకొన్న నిలఁ దప్పక కూలును నేనుఁగంత వాఁ
డయినను; జుట్టుఁ బట్టుకొన నప్పగిదిం బడు నయ్య? మిత్రుఁడా. 14

చ. నతుఁ డయి శత్రునైన నవ వినయమునఁ జేసికొను వివేకి; యు
ద్ధతుఁ డయి యొల్లవో నెపుడుఁ దమ్ములు దింపు వసించు లాఁతి; యె
వ్వతె మనఁ, గోఁతకాఁడు ను లవిత్రముతో నెఱుఁగండె శాలికిన్?
వ్రతముగ బెట్టఁ జే గవలవాఁ డవనిం గలుఁదారు? మిత్రుఁడా. 15

చ. ఎఱుఁగని వెన్నొ యుండు కని తొంచ తెఱుంగని నైన నొప్పు నే
యుఱుమను దర్పిత వృషు చమత్కృతిఁ బండితమాని; నెల్లు నే?

మొఱఁగు నవీన సజ్జను నె మ్మిచ్చును మందన తెల్వి లేమి; నం
దొఱు వగి నీ యనర విదప నో ర్వడి యుండ దె కుక్క? మిత్రుఁడా.

---

## గుణవంతుఁడు.

ఉ. ప్రాకటసద్గుణంబులు ప్రపంచమునం గలయెల్లవారికిం
జేకలు గాక, యొక్కనికి చిక్కవు, నిక్కువంబు; నీ
రాకర మాకరంబు మొదలౌ నొకటన్నిటియందె కాక, తా
మేకడ మానికంబు లుదయించుట లేదు గదయ్య? మిత్రుఁడా. 17

చ. చెడుకులమందు సంభవముఁ జెందినవాఁ డవుఁ డైన, వానికిం
గడు సుగుణంబు లున్న, నుతి గాంచుట కర్హుఁడు గాక గర్హ్యుఁడే?
పుడమిని గంటకాకులము భోగికులావృత మైనకేతకిన్
బొడమిన పువ్వు గర్భదళముల్, గొనఁ బాత్రము గావె? మిత్రుఁడా.

చ. గుణులకుఁ జేయుసాయ మది కొద్దిది యైన ఫలంబు హెచ్చు; దు
ర్గుణులకు నెంత చేసినను గ్రూరత నూపక పోర దట్లనన్,
దృణములు వేసు నావులకుఁ, దీయని తెల్లనిపా లొసంగెడున్;
ఫణులకుఁ బాలు వోయు, నిడుఁ బ్రాణము దీయువిషంబు; మిత్రుఁడా.

చ. ఎలమి నసాధు సాధువుల నేక విధంబున నాదరించినన్,
ఫలము పరస్పరంబు గడు వ్యత్యయ మై యుదయించు; నొక్క టే
సలిలముఁ బోసి నింబము రసాలముఁ బాదుకఁ బ్రీతిఁ బెంచినన్,
హాలహాలతుల్య మొక్కటి యమృతాభ మొకండు నగావె? మిత్రుఁడా.

చ. ప్రణుతనిజప్రసిద్ధగుణరంజితలోకుఁడ యేని, వానిజీ
వన మొకపూఁటె చాలు; నిల భ్రష్టుఁడు దాఁ దడ వున్న నష్ట మె
ట్లన్న ఘులకండ మున్న నిమిషార్థము చాలదె నోరకు? బెద్ద నీ
ల్పినఁ జెనుబోతు మ్రోయి, ఫలమే టగు నేమిఫలంబు; మిత్రుఁడా.

ఉ. ధారుణి వేషభాషలు యథార్థము నమ్మకము పొట్టకోస మే;
గౌరవ మింత కోరినను గావలెఁ దా గుణవంతుఁ డౌట్లనం,
గీరమువచ్చ తెక్కులును గెంపు మొగంబును గంతమాల యుం
జారుతరోక్తులుం, జెలియు సంకెల పాపు నటయ్య? మిత్రుఁడా.

చ. పరిమితి లేక యయోగ్యులను, స్వల్పతమంబుగ యోగ్యుల, న్వనుం
ధర సృజియించుఁగాక విధి, ధర్మవు సేయఁగ రాద యాయువం?
దరయ గులాబిచెట్టునను నాపదమస్తక ముండి కంటకో
త్కరములు నేల రాలవు గదా? మఱి పువ్వులఁ జూడు; మిత్రుఁడా.

చ. కలిగినసద్గుణంబు లధికంబు లగుక్ సుమనోగణంబునం
దల పలుగాకులందు నుదయం బయినం, దున మట్టి నిచ్చ నే?
పొలుపుగఁ జాతిపుష్పమునఁ బుట్టురసాములు వృద్ధిఁ బొంది మే
ల్ఫలము లగున్; జిగుళ్ళమృదులత్వము రక్తిమ పోవె? మిత్రుఁడా. 24

చ. తనసుగుణాంకితె యొక్కనికి ధారిణి గిట్టకయుండ వచ్చు; న
ట్లని యది యుజ్జగింప నగునా? జగ మాతనితోన యున్న దే?
కనకము గంధము న్విడదు గా, యలికిం దల కంటగించినన్?
జనములు దాస-నెట్లు శిర స్సావహింపక యుందురు? మిత్రుఁడా. 25

చ. అలవడుఁ బ్రాయికంబు గను నందఱు కెగ్గొనా లె బాల్యమం
దలఘులు కవ్వి తగ్గెను. వనంతెర; మస్ప్వన కట్లు. గావు; కా
యలు తేటు చన్ని దుష్పరుచు; పైవ రసాలశలాటుపుల్పు భూ ,
స్థలిఁ దఱుఁ గొంనఁ; జింతపులి చచ్చునె యెన్నఁటికైన? మిత్రుఁడా.

ఉ. కూళతనాన భూజనులకుం బగతుం డగునట్టిమూర్ఖు, కొ
న్నాళుల్ల కస్తై మ్మాఱి, సుమనఃప్రియవర్తి రసజ్ఞుఁ డయ్యెడుం;
గాలము చేత మాఱని చిగల్లు నెకి గొంగళిపుస్వ పిమ్మటన్
మే లగునా కుఁజిలకయ యొయి సంచరించుట లేదె? మిత్రుఁడా. 27

## శ్రద్ధ.

ఉ. సదమలబుద్ధిమంతులును, శ్రద్ధ వహింపక యున్న, లేశమున్
జదు పయిన న్మహోదయినఁ, జక్కఁ ధరింపఁగ లేరు నెమ్మదిన్;
విదితము, నిగ్గుటద్దములు వెన్కఁ గళాయిలేని యూన కున్న, నొ
ప్పిదముగఁ దాల్చునయ్య ప్రతిబింబములం? బరికింపు మిత్రుఁడా. 29

చ. అమలినచిత్తుఁడుం జలితుఁ డైన గ్రహింపఁగ లేఁడు నమ్మి స
త్యముఁ; జలితుండు గామి నొకదారి యథార్థ మెఱుంగు మందుఁడున్;
విమలజలంబులం గలితవీచుల బింబము భిన్నరూప మౌఁ;
గ్రమముగ వడ్డినీట నది గన్పడు నిశ్చలమందు; మిత్రుఁడా. 29

ఉ. ఆతతసంశయుం బుహృదయంబునఁ గల్గ, సదుత్తరంబులన్
పీకలరాఁడొ సుమతి వేగ మెఱింగి; జనుండు కాఁడు గా!
శాతనఖాంకురంబులను జల్లఁగఁ గోఁకినఁ, గోమలాంగకం
దూతి యడంగు; మద్మగుల నోపఁగఁ జూఁడినఁ బోనె! మిత్రుఁడా

---

## బుద్ధి.

ఉ. అంగబలంబు ధీబలసమాంశముతోడుత నైన పోలి నీ
యంగను రాదు; గావున బలాధికుఁ డన్నిట బుద్ధిమంతుఁడే;
యంగుగ ధారిణీశబిరాశ్యపి మర్గము చన్న, పోలిక
న్వంగదఁ డేలుఁ బట్టి జఠరాగ్నిని నేల్చుట లేదె? మిత్రుఁడా. 31

చ. నిరుపమబుద్ధి నైన మిడ, నీచుఁడు దుర్విషయంబులం బొరిం
బొరిఁ గనిపెట్టుటం దహితముల్ ఘటియించుట యుండుఁ బాపకున్;
పరవుల వంద తపితది ఫలరవ మేమి ఫలంబు! దానినే
ర్పరిత వెల్ల, వంచన తన్మగ్రహణంబునఁ గాదె? మిత్రుఁడా. 32

ఉ. అంగము వోలె బుద్ధి యును బ్రాణుల కార్యములోచితం బ రా
వం గను వచ్చుఁ; గారణగుణంబులు కార్యమునందుఁ బట్టవే?

సింగపుఁబిల్ల గంధవనసింధురకుంభముఁ జీల్చ నేరుఁ; బీ
నుంగుల వేఁట లాడను జనుం గద జంబుకజంబు? మిత్రుఁడా. 33

ఉ. ఎంతఁ బ్రవేశ పెట్టిన నహీనత నంది యొసంగుఁ; గానఁ దాఁ
జొందుగ మంచికార్యముల బుద్ధిని జొన్ప వలెన్ వివేకియై;
మందిరమందుఁ గ్రమ్మినతమమ్ము నడంపఁగఁ జాలుదీపమున్
మందరఁ జూరులో నిడఁ, బ్రమాదము సేయుక యున్నె? మిత్రుఁడా.

చ. అనయము వన్నె మీఱును వ్యయం బగుకొద్దిని బుద్ధి; కందుచేఁ
గనఁబడు నుత్తరోత్తరపుఁగార్యములందు మెఱుంగు లెట్లనన్,
కనకమునన్ గుణంబు లధికంబులు గా వె పుటంబు వెట్టినన్,
గనుక నె మేల్మిబంగరునగల్ వెల హెచ్చు గరంబు; మిత్రుఁడా. 35

ఉ. చక్కఁగ దాఁగి యున్నవి ప్రశస్తపుటూహలు బుద్ధిలో నిజం
బక్కఱ గల్గి మానక ప్రయత్నము చేసినచో బయల్పడున్;
నెక్కొని యుండ లేదె నవనీతపుముద్దలు పెర్వులోపలన్?
దక్కక వేఁత కవ్వమునఁ దచ్చి గ్రహింపదె వాని? మిత్రుఁడా.

చ. కవికిని శిల్పికిం గలము గైకొని వ్రాయుచు నున్న నూతనన్
నవనవచిత్రకల్పనలు; నమ్ముము మానిన నూర కుందు; నూ
రువులను గూరుచుండి కొమరుం డొగిఁ జూచుక మాను చున్న, వె
ల్లువ లగు చుండుఁ బాలుదుగ లోన నె యుంకవె యవ్వి? మిత్రుఁడా.

చ. పొడమినయట్ల యుంచినను బుద్ధికిఁ దేజము గల్గ దెప్పుడున్;
విడువక వేదశాస్త్రముఖవిద్యల రాపిడి పెట్టఁగా వలెన్;
బుడమిని మూలతాల్ మొదల బొగ్గులకున్ సరి యౌచు నుండవే?
కడు నవి శాణఘృష్టములు గాక వెలింగెదు నయ్యె? మిత్రుఁడా. 38

ఉ. పుట్టువుతోడనే గలుగు బుద్ధి యొకించుక యెల్లవారికిన్;
బట్టుగ దాని వృద్ధి పఱుప న్వలె విద్యఁ గ్రమక్రమంబునన్;

బట్టికి ముందు పాలవల వంటక మావలఁ బండ్లు భక్ష్యముల్,
బెట్టక యున్న నెట్లతఁడు పెద్ద యగుం? బరికింపు మిత్రుఁడా. 39

ఉ. పెద్ద యనఁ జిన్న యనుచు నొకభేదము లేక సమస్త సంగతుల్
బుద్ధి గ్రహింపఁ జాలుఁ జుమి పోఁడిమి గా; నది కొట్టు లన్నచో;
నద్దము పర్వతంబు పరమాణు వటంచును జూడ కన్నిటిం
దద్దయుఁ దాల్చు చుండ నిరతంబును జూచుట లేదె! మిత్రుఁడా. 40

---

## కాలము.

ఉ. కాలముమస్స్వభావమును గాంచి వివేకము గల్గునాతఁడే
వేళయు జాగరూకుఁ డగు; వెంగలి దానిఁ గనుం దృణంబు నం
బోలెను; ఐశ్వర్యతోహరుని భూరిధనాఢ్యుఁడు గాచి యుండు నె
కాలము; వానిలక్ష్మి మిల గర్భదరిద్రున కేల? మిత్రుఁడా. 41

ఉ. కాలము పెద్ద యుండఁగ నె గల్గుపనుల్ నెఱవేర్ప లెస్స; త
త్కాలము మీఁద నమ్మకము గల్గుట, డాయఁ గడంగు టొప్పునే?
నాలుగువస్తువుల్ గృహమునం జెనుదీపము వెల్గు చుండ నే
మే లగుఁ జక్కఁ బెట్టుకొన: మీఁదను విఘ్నము లెన్ని? మిత్రుఁడా. 42

ఉ. మేలును గీడు నెయ్యెడను మేదినిఁ బ్రాణులు పొందు చుండుటం,
గాల మె మూలమంచు నెఱుఁగన్వలె మానవుఁ డాత్మలోపలన్;
హేళిని బూర్వపర్వతము నెక్కఁగఁ జేయుఁ బ్రభాత; మాతనిం
గూలుచుఁ గాంతి సర్వమును గోల్పడఁ గ్రుంకిని మాపు; మిత్రుఁడా. 43

ఉ. కాలుఁడు సర్వకాలమును గాలము వైచుక కాచి యుండ, నే
కాలమునం దొ చిక్కుడును గాక, తొలంగెడుజంతు వున్నదే?
నేలను రాల కుండ ధరణీజమునందున నెల్లకాలమున్
వ్రేలుచు నాకు లుండఁగల వే యొకకొన్నియు నైన! మిత్రుఁడా. 44

ఉ. బాలుఁడు వృద్ధుఁ డొక్కగతి భాసిలు చూడెద రైన, వారికిం
గాలము వృద్ధియున్ క్షయముఁ గల్గఁగఁజేయు ననుక్షణం బదే
చాలనఁ, బూర్ణిమాదివససంఖ్యను బ్రాచిఁ బ్రతీచిఁ, జంద్రుఁడున్
హేళియు నొక్కమాదిరి రహించెద రే మగు మీఁద? మిత్రుఁడా.

ఉ. ఎట్టియుపద్రవంబు ఘటియిల్లిన నాయు వొకించుకంత దా
గట్టిగ నుండినం బ్రతుకు గాంతురు కాలము సెల్లువార లే;
యి ట్టటు పెద్దపెద్దదృఢవృక్షము లూఁగఁగ గాలి యున్ననన్
గొట్టినఁ బండుటాకులును గొన్నిల రాలవు గాదె? మిత్రుఁడా. 46

---

## ఉద్యోగము.

చ. అవనిని సత్ఫలంబులు మహత్తర కష్టసమావృతంబు లే
యవుటను జేసి వాని కెదయందును జంకిన లాభ మబ్బునే?
మొవలిని జుట్టుకొన్నచెడుముండ్లకుఁ బాములకున్ భయం పడం,
బువ్వులను గోసి తెచ్చుకొనఁ బోలునె యెవ్వరి కైన? మిత్రుఁడా. 47

చ. పలుదెఱఁగా నదృష్ట; మది పాటును బట్టి ఫలించు; రెంటిలోఁ
పలను నదృష్ట మెంచ బలవత్తర ; మొట్టు లనంగ, విత్తనం
బులు వివిధంబు ; లవ్వి గొని భూమిని జల్లక పండ ; వైనఁ ద
త్ఫలములు బీజధర్మమును దాఁటునె యత్నముచేత? మిత్రుఁడా. 48

చ. కడఁగక శక్తుడుం జిఱుతకర్జము దీర్పఁగ లేఁ ; డశక్తుఁడున్
విడువక యాచరించి నెఱవేఱుచుఁ దా ఘనకార్య మైన; నొ
క్కడుగేఁడు పోవ నేరదు మహాజగరంబు నిజస్థలంబునం
దుడుగక యుంట; జీమ పొరుగూరికి నేగిన నేగు? మిత్రుఁడా. 49

ఉ. సారము గల్గుదానికయి చాల శ్రమం పడఁ జెల్లుఁ గాని ని
స్సారపుదానికై పడిన, సర్వము వమ్మగు; స్వాదునీరసం

పూరితవారికేళిఫలముఁ బగిలించిన దప్పి దీఱు; నే
దారిని నేద దేఱెడును దయ్యపుఁబట్టు నగల్పు? మిత్రుఁడా. 50

చ. చెలువుగ నొక్క కార్యమును జేయుట కుండు ననేకమార్గముల్;
దలిఁచిన నందు యోగ్యమును దేలిక యైనది చేకొన న్వలెన్;
గలుగవె యూపిరి న్విడువఁగా మొగమందును నోఱు ముక్కు రం
బులు? నయినన్ సమస్తజనమున్ ముకుదారినె పుచ్చు; మిత్రుఁడా.51

చ. నడిపెద, మంత్రిగుప్తములు నుంబటుసారము లైనకార్యముల్
చెడ; వటు గాక యుండినను జేటు ఘటిల్లుట సిద్ధమే సుమీ;
ముడివి పొలాన విత్తినను మూఁడవనాఁటికి మొల్చు బీజముల్
పుడమిని; తోట దంచినవి, పొల్లులు మొల్చునటయ్య? మిత్రుఁడా 52

చ. ప్రతిదియు నాదిఁ గష్టతమభంగిన యుండును; జేయఁ జేయఁ, గ
ష్టతరముఁ గష్టమున్ సులువు శక్యము సౌఖ్యకరంబు నయ్యెడిన్;
క్షితి నడయాడ నేర్చుటకుఁ జిన్నతనంబున బిడ్డ లేచుచుం
బతనము నొందుచుం, దుదకుఁ బర్వులు వెట్టును గాదె? మిత్రుఁడా.53

ఉ. తా నెఱవేర్పఁ బూనుపని, తగ్గగతిం జిన్నచిన్న భాగముల్
గా నొనరించి, యంతపయిఁ గ న్నిడ కోలి నొనర్పఁ జుల్క నౌ;
మానము లెన్నొయుంటఁ, గను మాటుచు నేండ్లకు నేండ్లు చక్రిరూ
పాన గిఱుక్కనం దిరిగి వచ్చు నెఱుంగక యుండ; మిత్రుఁడా. 54

చ. పని పడియాలుపాళ్ళ నొకపా లవశిష్టము పెట్ట, వెన్కఁ జే
సినది వృథాప్రయాస; మది చేయకపోయిన మోద మబ్బ; దె
ట్లన, మణిసౌధడోలికను హాయిగ నిద్దుర వోవ నెక్కి, ని
చ్చెనతుదమెట్టు దాఁటఁ బస చెడ్డను నేమి ఫలంబు? మిత్రుఁడా. 55

ఉ. లోకము మేలు గోరి విమలుల్ ఘనకార్యము లాచరింప, న
స్తోకము లైనవిఘ్నములు దోఁచును వారల; కైన నోర్వరే?

లోకహితుండు జంతువులకున్ మధురోదక మీయు వెల్గ, మే
ఘాకృతి లబ్ధ మౌను గిరణాళికి; మాను నె దాన? మిత్రుఁడా. 56

చ. పని యను బాటు లేనియెడ భావమునం జెడుఁగోరికల్ జనిం
చును; నటుగాక యుండిన విశుద్ధ మగుం జుమి బుద్ధి; యెట్లు నా,
వనిశము బాటసారులు ప్రయాణము చేసెడుదారి శుభ్రమై
కనఁబడు; మాఱుదారి ముళుకంపలు మొల్చును గాదె? మిత్రుఁడా 57

---

## విద్య.

చ. కలిమి యొకింత లేకయును గౌరవపాత్రులె సుమ్ము పండితుల్;
కొలఁదికి మీఱుసంపదలఁ గూడియు మూఢులు మాననీయులే?
యలరవె మాపుగల్గు కను లంజనరేఖ ఘటింప కుండినన్?
కొలకుల కంటెఁ గాటుకను గూర్చిన గ్రుడ్డివి లెస్సె? మిత్రుఁడా. 58

ఉ. విద్దియ లేనివారలె యవిద్యకవారము లౌనగారముల్;
ముద్దుగ నెంత దిద్దినను మూఢులయాననముల్ శ్మశానముల్;
కొద్దియు వెల్గు లేనిమనుకుల్ పెనుఁజీఁకటి కున్కు; లెంత మే
లద్దపుమేడ లైనఁ గన నర్హమె దీపము లేమి? మిత్రుఁడా. 59

చ. ధనికుఁడు కొంతమందికి ముదం బిడఁ గల్గును నష్ట మొందుచున్;
ఘనకవి యైనఁ దాఁ గొఱఁత గాంచక యెల్లర హాళిఁ దేల్చెడున్?
దినఁబడి నీరసం బగుచుఁ ద్రెళ్ళును బెంటలమీఁద నించు; గ
మ్మనువకుళప్రసూనసర మవ్విధ మయ్యెడు నయ్య? మిత్రుఁడా. 60

ఉ. తోడెము విద్య నేరుపమి దుర్లభ మా సరసత్వ; మందఱున్
నాఁడెము నూ పఠింప; సుగుణాంబులు గొప్పకులం బొసంగు సే
గాడిదచేడియల్ మగల గట్టిగ ముట్టిలఁ దన్నుఁ; బోవ నీ;
గోడిగ లైన నేర్చి మగగుఱ్ఱముఁ దన్నక యున్నె? మిత్రుఁడా. 61

చ. క్షమను స్వరూపమాత్రఫలజన్మములం జూడక వారిజూని లో
కమున నెఱుంగ రేరు; కవిఁ గాంచక యే తెలియంగ నౌ; మనో
రమసుమనోలతాగవిసరం బగుకేళివనంబులోఁ, బలా
శములవిలాసముల్ వకులసంపద యుం గుతి కావె? మిత్రుఁడా. 62

చ. మగువ మగండు, విద్యను గ్రమంబుగ నేర్చినవారె యైనచోఁ,
సొగసుగ నుండు; వం చొకరు శుంఠగ నున్న నసహ్యమే సుమీ;
మొగమునఁ గన్నుదోయి యిరుమూల పదృగ్విభవంబు పూన, బా
గుగ నుపయుక్త; మం దొకటి గ్రుడ్డిది యైన నదెట్లు? మిత్రుఁడా. 63

చ. సరసతి, లేనిమూర్ఖునివచశ్చతి మైనను గాదు గాని, భా
స్వరరసికుండు వక్త్రనొక వాక్కెయినన్, సుజనప్రమోది యౌ;
ఖర మరవాయి లేక అరవంగాఁ బరితోషము నొందకుండి, కం
ధర ముఖమన్మయూరములు నాట్యము సేయుఁగదయ్య, మిత్రుఁడా.

ఉ. తల్లులు మంచుఁ బెంచి తమదారులె నేరిపి శైశవంబునం
బిల్లలఁ బాడు సేయుదురు విద్దె నెఱుంగని మొద్దుముద్దియల్;
పిల్లులు కన్నతే విడనిపిల్లల నిల్లిలుఁ ద్రిప్పి, వానికిన్
బల్లులఁ దెచ్చి ముం దునిచి బాధ యొనర్చుట నేర్పు; మిత్రుఁడా. 65

ఉ. పిన్నయుఁ బెద్ద యన్వయసుభేద మ దేటికి? బుద్ధిశాలి యౌ
చిన్నయె పెద్ద; పెద్ద యనఁ జెల్లునె వృద్ధుని నెద్దుమొద్దు? దీ
పోన్నతిఁ జీకువాల్ చెఱుప నోపును సన్నపువత్తి; రిత్త యై
యున్నను దివ్వెకంబ మిరు లోర్చునె? కొళ్ళకు నడ్డు; మిత్రుఁడా.

ఉ. ధారుణి నెల్లవారలకు దైవము వేఱుగ శక్తు లిచ్చెఁ; దా
నేరువ వల్ల కానివి యనేకము లున్నవి విద్య లెట్లనన్,
సారెల ద్రవేలు లుంచి సరసంబుగ వల్లకి మీటఁ గాక, యే
దారిని గార్దభస్వరుఁడు దా బయకొఁ దగువాఁడు: మిత్రుఁడా. 67

చ. గురువు వినాగఁ దాఁ జదువుకొన్నంత భరంబగుఁ దొల్తఁ; బిమ్మటన్
గరము ను నాస్థ పట్టుదల గల్గి పఠించిన నొజ్జ మీఱెడు;
స్వైరవునఁ దాళము న్మొదలు నిల్వఁడు నిచ్చిన నెక్కి నెట్టిగాఁ
డరుగఁ డె మొవ్వటాకు గదియన్ సుదిబల్లులు పూని? మిత్రుఁడా. 68.

చ. మననము సేయ కుండినను మాయదు మానసమందుఁ బట్టినన్;
దినము ను మానినం జెడును దిన్నఁగఁ బట్టక పూర్వమేని యున్;
బొనరఁగ వృద్ధి యా జలముపోఁతను మానినఁ బెద్దవృక్షముల్;
చినచిన మొక్క లట్టు లెడ సేసినఁ జచ్చును గాదె? మిత్రుఁడా. 69.

చ. ఎచట నొ యొక్కచోటఁ జనివింప వలెన్ గడి కట్ట; నట్టు కా
కచ టిచ టంచుఁ ద్రిప్పినను నర్భకు, విద్దియ వృద్ధిఁ బొందునే?
యుచితపు నేల నాటి యట నుండఁగ నిచ్చిన, వేరు పెట్టి మో
సు చిగురు పట్టుఁ; బూఁట కొకచోటను నాటినఁ బోదె? మిత్రుఁడా.

ఉ. పేరికిఁ బెక్కువిద్యలను వ్రేలటు వెట్టుటకంటె నేది యే
నారసి యొక్కవిద్యను నిరంతరశ పొంఁడితిఁ గాంచ మేలు; కాం
తారమునందు నాకసమునన్, మృగపక్షులు పత్పతత్రిపం
చార మొనర్చు స్వేచ్ఛ మెయి; స్వస్థత కొళ్ళకు నేది? మిత్రుఁడా.

చ. అరయఁగ బాల్యయౌవనములందును, సోమరులౌచుఁ గాలముం
జరిపినమానవుల్, గడవఁ జాలక యేడ్తు రనంతరార్తులన్;
దొరుసర, ప్రొద్దు గల్గఁగ నె తిన్ననియూరను జేరుకొనినో,
నిసు లరుదేర, దారి నతఁ డేమి యొనర్పఁ గలండు? మిత్రుఁడా. 72.

చ. సురుచిరభావకల్పనల శోభిలుపుస్తకలక్ష లొక్కయ
క్షరము ను దప్ప కుండ, వయసం బఠియింపఁగఁ జాలినన్, వృథా
వెరవిఁడికిన్; విచిత్ర మగువిశ్వ మజస్రముఁ జూచుచుం బళూ
త్కారములు, లాభము గనునె దాన నొకించుక యైన? మిత్రుఁడా.

ఉ. పంతుల మంచుఁ గ్రించులు, స్వపాండితి నన్యులతప్పు దిద్దఁ జూ
పింతు రయో! స్వపక్షమున కేమి యుఁ దద్వినియోగ ముండ; ద
క్రాంతముఁ జుట్టుఁబట్టుక నిజప్రభ నిచ్చును దివ్వెకంబముల్;
ధ్వాంతము తమ్ముఁ గ్రమ్ముకొన దానిఁ దలంప వదేమొ? మిత్రుఁడా.

ఉ. పండితుఁ డైనవాని కొకపట్టునఁ జుల్కఁదనంబు గల్గి యే
యుండును గాక, యట్లనుచు నొండులతో సరి సేయఁ దప్పు గా
కుండు నె? బ్రహ్మజాతి యగునుజ్జ్వలవజ్రము నీటఁ దేలినన్,
బెండునకున్ సమాన మని పేర్కొన రాదు గదయ్య; మిత్రుఁడా. 75

చ. చెడుగుణ ముండినం, జదువుచేతను గల్గుప్రకాశ మంతె చూ
ప్పడ; దది వీడినం బురుషుపాండితి సర్వతమోహరం బగున్;
గొడి గలదీపముల్ మిగులఁ గుమ్ముచుఁ దేజము దక్కి యుండెడుం;
జెడ నగి కత్తిరించినను, జీఁకటి బొత్తిగ మాపు; మిత్రుఁడా. 76

చ. ఒకరికి వచ్చి పోవు ననునొవ్వమిచేఁ, దన నేర్చుదాని వే
రొకరికిఁ జెప్పఁ డేనిఁ దన కున్నదె పాడగుఁ; జెప్ప మేలగున్;
సకలజనంబుఁ దోడుకొన సమ్మతి చేసిననూతిలోనినీ
ళ్ళకుఁ గొద వేమి? లాఁతిసలిలంబులు పాడగుఁ గాని; మిత్రుఁడా. 77

కు. చదివినవార లెప్పుడును సఖ్య మొనర్చద రెల్లవారితోఁ;
గదన మొనర్తు రెల్లపు డకారణ మజ్ఞజనుల్ స్వజాతితోఁ;
ముదమునఁ గీరశారికలు ముచ్చట లాడుఁ బరస్పరంబు; దు
ర్మదమున వానిలో నవియె మార్కొని కుక్కలు పోరు; మిత్రుఁడా.

చ. చదురున వేగు రజ్ఞులు ప్రసంగము సేయుచుఁ గూరుచున్నఁ గో
విదుఁ డొకఁ డున్న యందమున వేయవపాలును రాదు చూడుమీ;
వదరుచుఁ జూతవృక్షమున వాయసముల్ పదివేలు మూఁగినన్,
గదురునె పంచమస్వరపికం బొకఁ డుండినశోభ? మిత్రుఁడా. 79

చ. సదసున నెవ్విధంబునను సభ్యు లసభ్యులు గూడుచున్నఁ, ద
ద్వదనబహిర్గతంబు లగువాక్యము లే రుతిఁగించు వారలన్;
హ్రదమునఁ బెద్దబాతులు మరాళము లట్టిటు నీఁదుచున్నచో,
మృదుకలనిక్వణంబున గ్రహింపరొకో కలహంస? మిత్రుఁడా. 80

---

## విమర్శనము.

ఉ. తప్పును నొప్పు భ్రాంతిమయిఁ దాము గ్రహింపఁబడు న్విరుద్ధపుం
దొప్పన; నైన నిక్కువము నూరిజనంబు లెఱింగి చెప్ప రే?
యుప్పని పంచదార, మధురోత్తమశర్కర యంచు నుప్పు, కై,
తప్పునఁ జేకొనన్, నిజము తప్పక చెప్పదె నాల్క? మిత్రుఁడా. 81
ఉ. ఈనును రోస మాది యగునిట్టి రానుగొనంబు లున్న, నెం
తేసిరసజ్ఞు లర్థము గ్రహింతురు గా, విపరీతరీతి గా!
మీసర మైన పైత్యమును, మెం డగు నుష్ణము, నివ్వి యాది యా
దోసము లున్నఁ, నాలుకకుఁ దోఁపదె చేఁదు గఁదీపి? మిత్రుఁడా. 82
ఉ. వాఁగెడువాని నే పరమపండితుఁ గాఁ దలపోయు మూర్ఖుఁ; డా
లాగునఁ గాక వారలకొలందు లెఱుంగు వివేకి; గంటనా
దాగడియార మే ఘన మటంచును జానపుఁడు చూచెడున్;
జేగడియారమున్ 'ఘనము' సేయఁడె నాగరకుఁడు? మిత్రుఁడా. 83
చ. నవరసభవ్యకావ్యముగుణంబును జక్కఁ గ్రహించి శ్లాఘనం
గవి నొనరింపఁ బండితుఁడు గా కపామరుఁ డే మెఱింగెడిన్?
నవసురభిప్రఫుల్లనలినంబుమరందము గ్రోలి ఝుంకృతిం
దవిలి యొనర్ప షట్పదము దక్కఁ సమర్థ మె దోమ? మిత్రుఁడా. 84
ఉ. పేరును రూపుఁ గాంచి యొకపేరిని బెట్టఁగ రాదు; వస్తుస్వా
త్సార మెఱింగి యిట్టి దని తల్ప వలెన్; ఫలసంజ్ఞ నొందినం,

దోరపుఁబుర్వు లుండెడు నుదుంబరముం బరికింప; నుంచరా
కాఁతఁ దోఁచినన్, ముసిఁడిగర్భము చేఁ దగుఁ గాదె? మిత్రుఁడా. 85

ఉ. సరసము నీరసంబు నొకచందముగాఁ బయి కుండ వచ్చు; లో
నరసిన హెచ్చు తగ్గు తెలియంబడ కుండదు సుమ్మి యెవ్వరున్;
ధరణి రసాలదండము వినంబున నుండదె చొప్పకట్టి? పైఁ
బరఁగిన పేడు దీసి తిన, బైటఁ బసుం బస యెల్ల; మిత్రుఁడా. 86

చ. అరసిన నెట్టిసత్కృతికి నైనను దోషము లుండ కుండు నే?
వెరసిని దాల్ప మంజులత, విజ్ఞులశ్లాఘకు భాజనం బగున్;
బరుసము లౌచు నుప్ప నగుపర్వము లుండవె పుండ్రమందు? ని
ద్దర నొకఁడుం గనంబడునె దానిని మెచ్చనివాఁడు? మిత్రుఁడా.

ఉ. ఇతరులస్వల్పదోషముల నేని యెఱుంగఁగఁ జాలునట్టిపం
డితుఁ డయినం గ్రహించుకొన నేరఁడు పో తనగొప్పతప్పు; వి
శ్రుత మిది; లాఁతికంటిపువుఁ జూడఁగఁ జాలినలోచనంబుద
క్షత, తనలోపలం బొడముకాయఁ గనుంగొన నేర్చు? మిత్రుఁడా.

ఉ. మాకును జేత నా నెడుమానుసు లెందఱో యుందు; రైన న
య్యాకృతి కర్హుఁ డెవ్వఁ డొయునర్హుఁ డెవండొ పరీక్షఁ దేలెడున్;
వేమువ మేలుకొల్పఁ గలవే కరటంబులుఁ గోళ్లు; నైన నుం
గాకము, చంద్రికావిశదకాంతిని భ్రాంతము గాదె? మిత్రుఁడా.

ఉ. చేరువ కేగ కుండినను ఛిద్రము లేమియుఁ గానిపింప వె
వ్వారల కైన, డాసిన నపారముగా నవి లేక యుండు నే?
దూరమునుండి చూచినను దోఁచును గుట్టలు కోట వెట్టినా
ట్లూరక నున్న గా; నటుల యుండు నె దగ్గఱఁ బోవ? మిత్రుఁడా.

ఉ. పేర్మిమిడి పాదుకొన్నఁ గనిపింపవు దోషము లెన్ని యుండినన్;
దామస మున్న నొప్పులు నుదప్పులు గాఁ గనిపించు నన్ని యున్;

దామర, దుస్స్వభావము తైక్ష్ణ్యము మెచ్చి, పొగడ్త సేయు వే
మోములఁ; జంద్రికారుచికి మూఁతి ముడుంచుక యుండు; మిత్రుఁడా.

ఉ. పంకములోనఁ బ్రోయు ఘనపాపజగంబున దేహయాత్ర ని
శ్శంకతఁ జేయ, నొప్పఁ గనఁ జాలరు లోకులు; దోషదృక్కులే;
జంకక జాఱునేల నడఁ జాలిన నేర్పును మెచ్చ రెవ్వ; రె
వ్వంకను గాని కూలఁబడ వాని హసింతురు గాని; మిత్రుఁడా. 93

చ. గుణము దొలంగి దోషమునకుం దడవుం గుటిలుండు; దోషమున్
గణనము సేయకే సుగుణకాండముకై సుహృదుండు రోయు; ధా
రుణిఁ గమలాకరంబునను రోయక నత్తల నేఱుఁ గొక్కెరల్;
ప్రణుతమృణాళనాళము మరాళ మెఱింగి మెసంగు; మిత్రుఁడా. 93

చ. సరసపదార్థమందును బొసంగును దప్పులు; వెఱ్ఱివాఁడ వే
తొరగ గ్రహించి చూపు; సుహృదుండవి లోఁగొని యొప్పు దెల్పు; శ
ర్కరపాడిపానకాన నిసుకల్ చొరవే? వడపోఁతపాఁతవే
గిరమె పట్టి బైల్పుచు; గిన్నియ చేయునె యట్లు? మిత్రుఁడా.

ఉ. వంకర లెంతురే నవనవస్ఫుటసత్కృతి, కింకఁ దన్ని రా
తంకసమృద్ధిచే ముదమ్ము, తగ్గిన ఖేదము, గంద్రుఁ గాక? యే
ణాంకుని శుద్ధమంచు విదితున్ బుధవర్గము వెక్కిరించునే?
పొంకము మీఱఁ జొక్కుదును, బొల్పఱ సుక్కునుగాని? మిత్రుఁడా.

---

## హితోపదేశము.

ఉ. కూళల దిద్ద, వారలకుఁ గోపము వచ్చును; గాని లేశమున్
మేలొనగూడఁ బోదు; పయి మిక్కిలి బోధకు బాధ లొందెడున్
వైళమ; కుక్కతోఁకకును వంకర తీర్పఁ గఁ బూనఁ దీఱునే,
కాలది తత్క్షణం బొడిసి గట్టిగఁ బీఁకును గాని? మిత్రుఁడా. 96

ఉ. మందున కైనఁ దెల్పఁ గలమానిసికిం దెలుపంగ వచ్చుఁ; గా
కెంతయు సారశేషపరిహీనునకుం గలుపంగ శక్యమే?
పొందుగఁ గాష్ఠమైన నొకపోఁడిమి గా వెలిఁగింప వచ్చుఁ; గా
కెందును వట్టిబొగ్గు వెలిఁగింప నసాధ్యము గాదె? మిత్రుఁడా. 97
చ. సరసుని సామవాక్యములఁ జక్కనొనర్పఁగ వచ్చుఁ; గాని దు
ష్కర మగు ముష్కరుం గలితసాంత్వనపద్ధతిఁ జక్కఁ జేయఁ గాఁ;
గరసరసీరుహంబులను గ్రక్కున వేత్రముఁ దిన్నఁ జేయ నౌఁ
ద్వరితమ; వంటకట్టియల వంకర ప్రొయ్యెడఁ దీఱు; మిత్రుఁడా.
చ. కటువుల మందలించినను గన్నుల నీళ్విడుచున్ సుశీలుఁ డౌ;
నటువలె మొండి, వానికి సుమంతయు లొంగక రెచ్చు; నెట్లనన్
జోటఁ జోట నీటిబొట్టురల నొచ్చుచు జివ్వన లాగుఁ బండ్లు, మె
క్కుట నలపుల్లగాయలను; గొంకునె వానికిఁ గత్తి? మిత్రుఁడా.
చ. అలుక జనించి యార్చి యెవఁడైన నలంతుల బూకరించినం,
గలిగినతప్పు పోదు; తనకంటెను దిట్టలయొద్ద నేమి యౌ?
నిలువక కట్టకొక్కెయొడ నీళులు కన్నము వెట్టి పాఱుచుం,
బులుఁ బడ గెంటుఁ గా కుపితపుంజము నేమి యొనర్చు? మిత్రుఁడా.
చ. భ్రమయుఁ బ్రమాదము న్నరులఁ బాయునె? పండితుఁడైన నేమి? దో
స మెవరు దిద్దినన్ సరి యె, సంతస మొందుట మే; ల దెట్లు నా,
నమలము లైనయద్దములయందును డాగులు గావె! సీమసు
న్నముఁ దుడువంగ నిచ్చిన ఘనం బగుఁ గా తమకాంతి? మిత్రుఁడా.

---

## వివేకము.

చ. చపలమనంబు నీచ మగుజాడలఁ బోక నిసర్గమే; వివే
కపటిమచేత దాని నెటు కావలె న ట్లొనరింప వచ్చు; నీ

రిపుఁడు ను బాహుఁ బల్లమున కే గద? యైనను యంత్రసేతుము
ఖ్యాపరమసాధనాళి నది కా దటు కొనినరీతి? మిత్రుఁడా. 102

ఉ. ఇ ట్టటు దుర్మదేంద్రియము లీడువ నీడిచినట్టు లెల్లఁ దా
నెట్టనఁ బోవు హాని యని నిక్క మెఱింగి యు మూర్ఖుఁ డె ట్లనన్
వెట్ట గ మంట సోఁకిన వివేకము దెచ్చక మళ్ళి పోవు నే
బిట్టు గ దానిలో మిడుత వై పడి మ్రగ్గును గాని? మిత్రుఁడా. 103

ఉ. మందులు ముందు వచ్చువిషమంబుల నారయ కప్పు డాత్మ కా
నందము సేయుకర్జము లొనర్చెద రింద్రియాకృష్యమాణు లై;
కందనిపచ్చ లేఁబయిరు కన్నులపండువు సేయ, డెంద మిం
పొందఁగ మేయఁ బోయి కరు లోదములోఁ బడుఁ గాదె? మిత్రుఁడా.

---

## సంభాషణము.

చ. ఒనర మనుష్యయోగ్యత యయోగ్యత ముందు గ మాటఁబట్టి యే
గనుఁగొను చుందురు లోకు; లటు గావున సొంపుగఁ బల్కఁగా వలెన్;
బనఁటుల నోటిపలుకు వినఁబడ్డను నవ్వులఁ దోఁచి వైచి, టం
గున వినఁబడ్డచో నిలుచుకొందురు గ్రా వెల యిచ్చి? మిత్రుఁడా. 105

చ. ఇలఁ గలయెల్లదోషముల కిక్క యసత్యము; గాన దోసకా
రుల కది యిమ్మ; సత్కృతిపరుల్ బుధు లుల్కుచు నుందు రానికిన్;
జెలఁగ ర చిమ్మచీఁకటికిఁ జిత్తమునం గదు జారచోరము
ఖ్యులు? వెలుఁ గన్న సంతసము నొందరె యుత్తము లెల్ల? మిత్రుఁడా.

చ. ఘనత యు నాభిజాత్యము ను గవ్వకు నుం గొఱ గావు, మాటలోఁ
గనుక నొకింతవచ్చు యొకఁడు గనుంగొనె నేని; కీ డగున్;
విను, తనముద్ర కిద్ర యును, వెండియు గిండియుఁ జూచి రూప్యమున్
జనములు గొందు రే? పలుకు జ బ్బయినం దునియింతురు; మిత్రుఁడా.

చ. ఇలపయి వాడి తిప్పనలేఁ డెంతఘనుం డయినన్ సడిం బడున్
నిలుకడ లేనివాఁ డనుచు ; నిక్కము యోజనఁ జేసి పల్కు మేల్;
జలదము ముందువెన్కలుఁ విచారము సేయుట మాని ముందు గా
బడబడ లాడుఁ; గావున నె పాటి యొనర్పదు దాని; మిత్రుఁడా

చ. కొలఁదికి మీఱు దంభములు గొట్టెడువాంఛను విశ్వసించి మ చే
గలుగదు; గల్గు నో, యవిటి గా; తుది సందియ మా నిజానకే;
తళుకుఁబసిండిపూఁతఁ పయిఁ దాల్చి వెలింగెడువెండిగిన్నె యన్
విలిచి సువర్ణబుద్ధిఁ, దుది వెండికి సందియ మొందు; మిత్రుఁడా. 109

చ. ఎదిరిమనంబు నొవ నటు లెంత యు నింపుగఁ బల్కువారలం
బనుగురు గారవింపుదురు; పల్లదులం దరిఁ జేర నిత్తు రే
ముదమునఁ గీరశారికల ముద్దుగఁ బంజరమందు నుంచి పెం
చెద; గలకాకులం జెదరఁ జేయ రె చీఁదరఁ జెంది? మిత్రుఁడా. 110

చ. సమయ మెఱింగి పల్కువిలసన్మృదువాక్కులు వోలెఁ దీవ్రవా
క్యము లొనరింప నేర వొడికంబుగఁ గార్యపుసిద్ధి; నెట్లనం,
బ్రమద మెసంగ రాల్చును బ్రభాతపుశీతలవాతపోతముల్
సుమఫలముల్; శిలాటుపుల ద్రుల్చును గా పెనుగాలి' మిత్రుఁడా. 111

చ. వ్యపగతమార్దవంబులు మహాప్రియముల్ సమయానుకూల మా
లపితము; లట్లె కానిమృదులంబులు నప్రియముల్ సుధల్; ప్రభా
తపుఁదటిఁ గాకికుక్కుటరుతంబు హితం బగు నెంత యున్; వియో
గపుసమయంబునన్ శుకపికస్వర మార్తికరంబు; మిత్రుఁడా. 112

ఉ. ధీరుఁడు జానుగుల్ సొగియఁ దేనియ లొల్కఁగఁ బల్కు మెల్లగాఁ;
జేరినవారికిం జెవులు చిల్లులు వోవఁగ నాడు నీచు; డిం
డీరరసానుకారికలనిక్వణనం బొనరించు వీణియల్;
భేరణముల్ రణంబు నొదవించును దారుణభంగి; మిత్రుఁడా. 113

ఉ. అన్నము గల్గ మై మఱచి యల్పుఁడు కాఱులు ప్రేలుఁ; జాలఁగా
నున్నను సజ్జనుండు పరుషోక్తుల నెన్నఁడు దేఁడు నాల్కఁ; గ
ట్లన్న, శిరఃకఠోరముగ నార్చును భేకము వానకాలమున్;
సన్నపుఁగాకలిం బికము సల్పు వసంతమునందు; మిత్రుఁడా. 114

## కొండెము.

ఉ. కొండెము పేరిదుర్గుణము గూర్చిననాలుక నేర్పుకోడెఁ దా
ఖండముఁ జేసికొన్న బ్రతుకంగలఁ డే మొకరుండు నెవ్వఁడైఁ;
నిండ విసంబు గల్గి కడు నిక్కెడుకొండిని గత్తిరింప, భూ
మండలి వృశ్చికంబు జనమైత్రికిఁ బాత్రము గాదె; మిత్రుఁడా.
ఉ. కోరికతోడ నొండ్లచెవిఁ గొండెము లూఁదెడువారి నేరిని
గూరిమి నేస్తకాండ్రయిన గొబ్బున వీడక మాన; రట్లనన్,
నాకలు చారుకేళిసదనంబున నాథులఁ గూడువేళ మం
జీరములందుఁ బ్రేముడి యొకించుక చూపరు గాదె? మిత్రుఁడా. 116
చ. పిశునినిఁ జేర్చు టెంతయవివేకము? వాఁడొరు వెట్టు లట్టు లే
విశద పథంగఁ జేయుఁ దమవింబయివారి; కదెట్టు లన్న, నల్
దిశలఁగవాక్షకాచములు, దెచ్చుఁ బగల్ రవికాంతి లోనికిన్;
నిశల రహఃక్రియల్ గల వె నిప్ప బయల్పడ కుండ? మిత్రుఁడా. 117
ఉ. అన్యుల కగ్గు సేయుకలహంబులఁ బెంపను మూలమైనపై
శున్యముచేత నెవ్వఁడు వసుంధర నాపదఁ బొందకుండెడున్?
జన్యములో వలం బిగులు చక్కఁ గనొత్తెడువానికత్తుకన్
దైన్య పడంగఁ గోయ రెటు దల్పక జాలి లవంబు? మిత్రుఁడా. 118

---

## అతిపరిచయము.

చ. పరిచయ మెక్కుడైన బరిభావము నొందు మహానుభావుఁడుం;
బొరయు నుదారగౌరవము బొట్టకుఁ జుమ్మి మితపర్చయంబునన్;
బరిమళవన్మృదుప్రసవపక్వఫలాంచిత దైవసృష్టస
త్తరుల నిరాకరించి కొనఁ దల్పరొకో కృతకంబు? మిత్రుఁడా. 119

చ. మిత మగు నేని యొద్దియును మేదినియం దనవద్య మౌను; గా
కతి యగు నేని యన్నిట ననర్థమ యౌ; మితి మీఱ రాదు గాఁ
వితతతరోష్ణదేశమున వేసఁగిలో బొగ డొందు ప్రాతరం
చితపవనార్భకుం డగడుఁ జెందఁడె సీతునయందు? మిత్రుఁడా.1204

ఉ. వాడుక మాటికిం బొరుగువారల యిండ్లకుఁ బోవు చున్నఁ, దే
కూడదు గౌరవంబు; తుది గొప్ప పరిభవ మౌ నిజంబు గా;
గాడిదతోఁక కర్భకలు గట్టుచు నుండరె తాటియాకులన్?
జూడరె యబ్బురంబు గను శుద్ధకురూపిని నొందె? మిత్రుఁడా.121

చ. అభిరుచి యెక్కుడౌ నభినవాగతులం దతిహీనులం దె; దు
ర్లభగుణాఢ్యులందును బురాతనులం దనురాగ మల్ప మే;
యభిలషితంబు లౌ నపగతార్థము లయ్యును బాలభాష; ల
వ్యభిచరమంజులార్థబుధవాక్యము లంత ప్రియంబె? మిత్రుఁడా.122

చ. మనుజున కింతయేనిఁ జనమానము గల్గును గాక, తేనిపా
లను గుడుపాల, భీతికి దొలంగినచెయ్యి యొనర్పఁ గూడు నే?
మనగృహమం దె యున్న దని మాధ్యముతోడను ముద్దు పెట్టుకో.
గనగన వెల్గుదీప మెటు గాలక యుండెడు నయ్యా? మిత్రుఁడా. 123

ఉ. పోకడరాకడల్ గలుగఁ బుట్టవు దోషము; లవ్వి పొత్తిగన్
లేక జనించు నెగ్గు లవలీలగ బంధుసుహృద్గణంబులో;
లోకములోన వారినిధిలోనికి వచ్చుచుఁ బోవు చుంటచేఁ
బాకుడు పట్ట దేళ్ళకును; బాడగు గుంటనీళ్ళు; మిత్రుఁడా. 124

---

## స్నేహము.

చ. చెలిమి సమంబు గా నుభయసీమలఁ బ్రేమము గల్గ లెస్స యౌఁ;
గలుగక యున్న, నొక్కఁడన కల్గిననున్ విరసం బ యౌను; మ
ర్దళము ధిమింధిమిధ్వనుల శ్రావ్య మగుం, బెనువాలు రెంటు బ్రి
క్కల బిగి యార నున్న; నటు గల్గమి నింపగు నయ్యె? మిత్రుఁడా.

చ. చెలిమిఁ బరస్పరంబు మనఁ జేటు ఘటింపఁగ లేదు శాత్రవుల్;
కలహము పుట్టినన్, సుళువు గాఁ జెలుచుం దమలోనివాఁడె; కా
నల నతిసాంద్ర మాతరుగణంబు మహాబలుఁ డుర్విఁ గూల్చునే?
కలఁతల నవ్వి యే యొరయఁ, గాల్చుఁ దదగ్ని తదాప్తి; మిత్రుఁడా.

చ. వలఁతి కలంతి కేటిసహవాసము? దైవము గూర్చినన్ మదుల్
గొలుపక యేటి కొక్కరుఁడు, గోటికి నొక్కరుఁ, దీయు చుండ్రినూ;
వలకయి డాకయిం గలసి వచ్చెదు నే చనువేళ, ముందువె
నక్కలకు ను బోవుఁ గా కొకఁడు గానక యుండ నొకండు? మిత్రుఁడా.

చ. చెలిమిని మార్దవంబునను జేకుఱుఁ జాల్కన గా నభీష్టముల్;
తలఁపఁగ నాగతిన్ బెళుచుదారిని నెగ్గ నటయ్య కార్యముల్?
జలమున నానుమన్ను గొని, సల్పుఁ గులాలుఁ డభీష్టభాండమ; ము
జ్జ్వలశిఖిదగ్ధభాండమును శక్తుఁ డ గాఁ త్తుమ్ముఱ మార్ప? మిత్రుఁడా. 128

చ. క్షమ నధికారగర్వితులఁ ఖ్యము గొప్పసుఁ జేయుఁ గోరుచుం,
గుమతులు వారికి నొడ్డె యొడఁగూర్తురు; గాని యదేమి నేస్త మాఁ;
బ్రిమిదలు దీపముం దమశిరంబునఁ బెట్టుక తైల మిచ్చు; నా
క్రమమున నెప్వుడీ పపుడ కాల్ప దె బన్గవచుండి; మిత్రుఁడా. 129

చ. అలవను వేగ; నాచి ఘన మాఁ; జెడు నోలి; సహాయహేతు వే
యలఁతులచెల్మి; దానికి మహాజనమైత్రి విపర్యయంబు; చీ
రల వెస ముం దె చిన్నములరం గతిసాంద్రతి నఁటె, వెంట నే
వెలిసి కలంకు దెచ్చుఁ; జెలువేరు విరుద్ధముగా దె? మిత్రుఁడా. 180

[illegible] చెవఁటులతోడి నెయ్యమునఁ జేటు ఘటిల్లక మాన దెంత స
జ్జనులకు నైనఁ; గాన ఖలసంగతి కెవ్వఁడుఁ దవ్వుకో వలెన్;
ఘన మగుమల్లెపువ్వులఁ బకాపక నవ్వుమదుంగుఁబుట్టముల్,
గొనకొని చాకిచేత నుతుకుల్ దిను మంటిని నంటి; మిత్రుఁడా. 131

చ. వడవడి తిన్న గాక చెడునట్టిచెనంటుల దిద్ద బుద్ధి లోఁ
బొడమిన, మంచిమార్గమునఁ బోయెడుప్రోడలతోడఁ గూర్తు రె
య్యెడలను; దొంగగడ్డి దిన నీవల నావలఁ బోవుగొడ్డులన్
విడువక, లంకె వేయుఁ గద వ్రేఁడిల సాదులతోడ! మిత్రుఁడా. 132

ఉ. పెద్దలవర్తనంబు గని పెట్టి సుబుద్ధి నిజప్రవర్తనన్
దిద్దుకొనంగ నేర్చు; నది నేరఁడు బుద్ధివిహీనుఁ డౌఁ జుమీ;
యద్దముఁ జూచి దిద్దుకొనునట్టిసమర్థత దృష్టిశాలి కే
తద్ద యుఁ గద్దు; గాని వసుధం జనుపాంధున కేది? మిత్రుఁడా. 133

ఉ. ఉత్తమచెల్మిచే సరగ నొందును సద్గుణముల్ సుశీలసం
పత్తి నెసంగువాఁడు; నయబాహ్యుఁడు నైజగుణంబు మాను నే?
య త్తరుసౌరభంబు ధవళాంబరముల్ ధరియించు వెంట నే;
గత్తరకళ్లుగుడ్డ తనకంపుఁ ద్యజింపదు గాద? మిత్రుఁడా. 134

చ. ఘనులను గూడునల్పులు ను గౌరవపాత్రులు సుమ్ము; గౌరవా
ర్హున కయినం బరాభవ మె యుర్విని నీచులసంగతి నమ్మనన్;
మొనలను జక్రవర్తిపదముల్, స్పృశియించు లసత్కిరీటరా
డ్వినతశిరంబు; లల్పుతల వీథుల బర్వులు వోయు; మిత్రుఁడా

చ. వసుధ నసద్గుణంబు గలబాలిశుఁ డొక్కనికారణంబునన్
దొసఁగు పొసంగి పొక్కుదరు దోసము వీసము లే క నేఁడు లోఁ;
నసదృశవేదనాకరమహావ్రణగర్భ పునర్భవంబుచే
లసదఖిలాంగకంబులకు లావు గ వేఁకి జనించు ; మిత్రుఁడా. 136

చ. బలియుఁడ నంచు నల్పులను బాటి యొనర్పక, వారియుల్లముల్
కలఁత పడంగఁ జేఁత కొఱంత గా; దిల నందఱితోఁ బొందు మేల్;
గల నొక బారెఁ డంచుఁ గడుగర్వముతోఁ ఫణి పుట్టఁ దూఱ, లో
పలఁ జలిచీమ లన్నియును బట్టుక చంపవె దాని? మిత్రుఁడా. 137

ఉ. వలఁతు లటుండఁ గా, నలఁతివారలతోడను గార్య ముండు; న
ష్టు లగుట హీను లంచు నెపుడుం జెడ నాడఁగ రాదు సుమ్మి వా
రల; మొహరీలు కాసులు వరాలు కరంబున నుండ, రాగిపై
సలకొఱ కే యవశ్యము బజారున కేగుట గల్గు; మిత్రుఁడా. 138

## ఐకమత్యము.

చ. తల యొకదారి గాక ప్రమదంబున నల్గురు నేక మైన చోఁ,
దలఁచిన కార్య మే దయినఁ దథ్యము గా నెఱవేఱుఁ; బుట్టెఁ డాఁ
కలిగొని పోయి సిద్ధ మగుకంచమునొద్దను గూరుచుండినం,
గుడుచుట యెట్లు వేఱొకఁడు గూడక వే ఱగు నేని? మిత్రుఁడా

చ. బలమును సాంప్రఁ జెంపు విభవంబు సమస్తము నైకమత్య మే
కలుగఁగఁ జేయుఁ; భిన్నతను గాంచున దెల్లఁ దలంప నష్ట మే;
శిలలును దారువుల్ మొదలు చేరి మహోన్నతహర్మ్య మయ్యెడున్;
దెలియుము దేని కద్ది విడఁ దీసిన నే మగు నొక్కొకటి? మిత్రుఁడా.

ఉ. చెప్పెడి దేమి? దేవుఁడు సృజించినసృష్టిని దేనిఁ జూచినన్
జెప్పును, నైకమత్యమునఁ జేకురులాభము, లాఁతి నష్టమున్;
గొప్పగ గాలి గొట్టినను గొండలు జంకు నె; వానిఁ బాసి పెం
దిప్పగు రేణువుల్ మొయిలుతీయనఁ దూలును గాని; మిత్రుఁడా.

చ. చెదరక యైకమత్యమును జెందినచో బలహీను లయ్యు నుం
బదుగురు గూడి పాటు పడి భారపుగార్య మె నిర్వహింతు రాఁ;

చెదపురుగుల్ కరం బలఁతిజీవు లయైనను, గుట్టలో యనం
బొదలెడునబ్బురంబు లగుపుట్టలు వెట్టును గాదె? మిత్రుఁడా. 142

ఉ. కాళులు తమ్ము డీకొలఁదిఁ గొంట్లవివేకత నైకమత్య ము
న్మూలము గా, నకారణ మ పోరుదు రాఅనిమచ్చరంబునన్?
గాలికిఁ గత్తికట్టి యొఱకల్ నిమురంగ నె చివ్వ కుద్దులై
కోళులు ప్రాణహానికి ని గొంక క తాఁకును గా దె? మిత్రుఁడా. 143

చ. తలఁపగ నొక్కతల్లికిని దా రుదయించియు, శైశవంబునన్
మెలఁగియు నైకకంఠ్యమున, మీఁదట వేఱగు చుందు రన్నద
మ్ములు; శుభ మా నెఱి? నారికడపున్మ్రొవుటాకులు గాలి వచ్చినం
జలనము నొందు నే? ముదిరి జంకుచు నుండును గాని, మిత్రుఁడా. 144

ఉ. ఓలిని నైకమత్యమున నొప్పెడుసోదరు లొందుచుండ్రు బల్
మేలులు; వారు వేఱు పడ మేదినిఁ గాంతు రనేకనష్టముల్;
తాళదళంబు ప్రీలక యుదారత నాదల నుండు ఛత్రమై;
ప్రీలి విహీనతం బదముక్రిందను జాఁప గ నుండు; మిత్రుఁడా. 145

## స్నేహితుఁడు.

చ. జనునకు నొక్కఁ డైనను నిజం బగుప్రాణసఖుండు గల్గినన్,
ఘనతరదుఃఖముల్ దొలఁచుఁ; గావలెఁ దప్పక మిత్రసంగ్రహం;
బనలుఁడు ధూమజాలమున నావృతుఁడై కృశియించి యుండఁ గా,
ననిలుఁ డొగిం బొగం జెదిచి యాతనిఁ గాచుట లే దె? మిత్రుఁడా. 146

చ. విహితునిలోపముం బయటఁ బెట్టక యాదలఁ గాచు శిష్టుఁ; డి
మ్మహి సహవాసి దాకొఱఁత మాటక దుష్టుఁడు కీడొనర్చెడున్;
రహిఁ దలపాగ, గాచుచు శిరంబును దాఁచుఁ జినుంగుఁ; గాని తా
సహితము సేయు సందియనయప్పుడు మైకుబుసంబు; మిత్రుఁడా.

చ. ప్రియము నయినన్ విసం బరిహరింప వలెం బరికించి దుష్టు; న
ప్రియము నయినన్ సహించి కడుఁబ్రీతిఁ గొనన్ వలెఁ జామ్మ శిష్టుఁ; దీ
పయిన విషప్రయుక్త మగునట్టిది భక్ష్యము ద్రోయ రెట్లు? చేఁ
దయినను నోర్చుకొందు నిల నౌషధముం గొన రెట్లు మిత్రుఁడా.

ఉ. బాగుగఁ దేనెపలుకులను బల్కుచు మానసముం గరంచి, బల్
సేగి యొనర్చుఁ గృత్రిముఁడు; చేటున కే సుమి వాని నమ్మటల్;
నాగసరంపుబుఱ్ఱ కలనాదము వీనులవిందు సేయఁగా,
లాఁగ దొఱంగి వచ్చి వెతలం బడ దే భుజగంబు? మిత్రుఁడా. 149

ఉ. మంచియవస్థలో హితులమాడ్కిని సాయము చేయుచుండియున్,
గొంచెము కొలు వంగుతటిఁ గూళ లపాయ మొనర్తు రట్లనం,
గాంచుటకు స్సహాయ మగుఁ గన్నులకున్ సదవస్థ దీపముల్;
వంచన వైరులై కలఁక వచ్చినఁ జూడఁగ నీవు; మిత్రుఁడా. 150

చ. ఎలమిని సజ్జనుండు మన సిచ్చి మెలంగును; గాని యొన్నిభం
గుల నయినం గినుంగొనఁగఁ గూడు నె దుర్జనునంతరంగమున్?
తెలివి మెయిం బసందు గను దివ్వియు లాంతరునం గనంబడున్;
గలుగు నె యొంత తోమినను గన్గొన మృణ్మయపాత్రి మిత్రుఁడా.

చ. ఎవ రెటువంటిమిత్రు లొ గ్రహింపఁగ రాదు సమక్షమందు; వా
రివిధముఁ జేయఁగా వలెఁ బరీక్ష పరోక్షమునందు లెస్సగాఁ;
దొవ యుఁ జకోర మేల, నెల తోఁచుడు మాతులు విప్ప నెన్ని యో
పువులుఁ బులుంగు లాతఁడటు పోయినఁగూడు నె యన్ని? మిత్రుఁడా.

చ. కలిమిని నెల్లవారు సహకారు లె; వారల నట్టివార కాఁ
దలఁపఁగ రాదు; నెచ్చెలుల దైన్యము గాఢపరీక్ష చేసెడిన్;
మెలఁకువలో మనంబునకు మిత్రము లే సకలేంద్రియంబు; లా
చెలిమి యసత్యమో నిజ మొ చెప్ప దె నిద్దుర వచ్చి? మిత్రుఁడా.

చ. సిరి చెడి వచ్చె నంచు, సిరి చెంత నటంచు ను, కొంచె కర్వుడుం
గరము ను గారవించు చెలికానిని వొందుచు సత్సఖుం; డ తే
సరణి నసం గఁ, జూడు మిలఁ జంద్రు నమాసను నిండుఁబున్న మం
సరిగ నె నింగి మొట్టుచును సంద్ర మెదుర్కొనుఁ గాద? మిత్రుఁడా.

చ. ఇముడక పైకిఁ బె ల్లుబుకు హృద్గతతాపము బంధుమిత్రసం
గమమున నాశదారులకుఁ; గాన నె దుఃఖము దీఱు నంతతో ;
తమఁ బెనుబట్టిఁ గాలిచినసంద్రపుగుల్లను నీళ్లు చల్లఁ, దిం
ద్రము గను నావి లేచుఁ గద డాయ భరం బగునట్లు? మిత్రుఁడా.

చ. మనసున దుఃఖ ముండిన సమస్త మసహ్య ము; కాన ప్రాజ్ఞుఁడుం
గనఁ దుచితంబు నయ్యెడలఁ; గా వలెఁ దప్పక మిత్రుఁ డప్పు; డె
ట్లనఁ, బెనుఁగాఁక కోరువక యగ్గిఁ బడం గమకించుబొల్లు, త
గ్గు నె తనుయంతటన్, జలము గొబ్బునఁ బోవక యున్న? మిత్రుఁడా.

ఉ. భావము చెల్మి నిండి యెడఁబాయక వచ్చెదుసంగడీలలో
శేవిధి నైన నొక్కనికి నె గ్గయి నన్ బెఱి యూర్వ నేర్చు నే?
కాపటిపూర్ణకుంభముల గ్రక్కున నొక్కఁడు విచ్చి పోవ, నె
క్కొవడి భూమిపైఁ బడమి గల్గును రెండవకుండ? మిత్రుఁడా. 157

ఉ. ఎవ్వరిబుద్ధి వారలకు నెక్కువ గాఁ బని సేయ దావదల్
నెవ్వగఁ జేయ; నాప్తులమనీష విశేషశుభావహం బగున్
జూ వ్వె; స్వహస్తదీపము కనుల్ మిఱుమిట్లుగొల్పఁ జీఁకటిన్ ;
దివ్వియ భృత్యు చేతియది, తిన్నని తెన్నను జూపు; మిత్రుఁడా. 158

ఉ. సంపద వార్తి రెంట సదృశక్రియఁ డొక్కరుఁ డే హితుండు; చిం
తింపఁ గ నట్టివాఁడు గలఁ డేనికి, భంగము లేదు వానికిన్ ;
సొంపు గ జాగరంబున సుషుప్తిని నేకవిధంబునం బ్రవ
ర్తించె శ్వాస? శుద్ధి గల దేనియు దేహికి నేమి? మిత్రుఁడా. 159

చ. చెలు లగువారి కైన మెడ సేసిన నేమి? తదంతరంగముల్
గలయక దూర మౌనె? యది కానఁబడుం గద వాగ్వృత్తులన్?
నెలకొని మధ్య నాసికము, నేత్రయుగంబును వేఱు చేసినన్,
గలుగునె వేఱు వానికి వికాసముఖక్రియలౌను? మిత్రుఁడా. 160

ఉ. చుట్టఱికంబుఁ జెల్మిఁ గలవోటను నెక్కువదక్కువల్ కొలల్
వెట్టక చూచుకోక యొదవింతురు నమ్మి సమానగౌరవం;
బెట్టు లనంగ, రత్నములయిక్క సముద్రుఁడు, శైవలౌఘముం
బట్టగు నేటిలోనికిని వచ్చుట పోవుట లేదె? మిత్రుఁడా. 161

ఉ. బాగునఁ గూడి యుండి యెడఁబాయుదు రోగునయందు బందుగుల్;
బాగున నున్న మానిన, విపత్తున మిత్రుఁడు దోడు సూపు; నే
లా గనఁ, గవ్వ మగ్గి యుఁ గలంపఁ దపింపఁగ, వెన్నమీఁగడల్
వేగ దధిం బయమ్మునను వే ఱగుఁ; దోఁపగు నీళ్ళు; మిత్రుఁడా.

చ. తనకును కీటుఁగాల మిలదగ్గఱఁ బడ్డను బ్రాణగొడ్డపుం
బని హిత మంచు దోఁచు; హితుపల్కుపద్ధతి ప్రాణగొడ్డ మౌ;
గనగన వెల్గుదీపకళికన్ శలభంబు ఫలంబొ పుష్ప మౌ
యని పయి వ్రాలఁ జూచు; వల దంచటు ద్రోచినఁ బోదు; మిత్రుఁడా.

---

## పరోపకారము.

ఉ. ఆరయఁ దాను కష్టముల నందుచు నైనఁ బరోపకారు లీ
ధారుణిలోన నార్త పరితాపము మాన్తురు తమ్ముఁ జేరినన్;
భూరుహముల్ నిదాఘమునఁ బొల్పఱు చుండి యు నెండవేఁడిమిన్,
వారక యధ్వగశ్రమము వాపవె నీడ యొసంగి? మిత్రుఁడా. 164

చ. కటకట! తాను మృత్యుముఖగహ్వరమందును నుండు నెంచ కె
ప్పటికిఁ బరోపతాపమున భావము నిల్పు నెవండు? ధీవరో

త్కటచటులాహిరాట్కబళితం బగు చుండియు మండుకంబు, చెం
గట నటు వ్రాలుమక్షికల గ్రక్కున మ్రింగఁ దలంచు; మిత్రుఁడా.

చ. కర మపకార మొంది యుపకారము సేయుచు నుంద్రు సజ్జనుల్;
కర ముపకార మొంది యపకారము సేయుచు నుంద్రు దుర్జనుల్;
బరువడి తాల ఉవ్విలను బండు లోసంగు రసాలసాలముల్;
విరుల నలంకరించినను వేసన సేయ దె యూఁగు ? మిత్రుడా. 166

చ. తమ వెఱవారు నా కతిహితం బొనరింతురు నిర్మలాత్ము లా
క్రమమున సే యొనర్తు రపకారము నెల్లరకున్ మలీమసుల్;
వినుతుల నైన దీపములు వెల్గెడు లాఁతి కభేదబుద్ధితోఁ;
దమతమ వయ్యు నీడలు పదంబుల కడ్డము రావె ? మిత్రుఁడా. 167

చ. సూఁడయినం గలంగినను జూడఁగ నోడి విశుద్ధుఁ డాత్మ సం
పీడకు నైన నోర్పుకొని ప్రీతిని నాతనిఁ దేర్చు; నెట్లనన్,
బాడె యపార మై కలఁకఁ బాఱిన నీరమునావిలస్థితిన్,
వీడఁగఁ జేయు దే పటిక, వే పొడు మై చొరఁబాఱి ? మిత్రుఁడా.

---

## భూతదయ.

చ. ప్రతిఫల మేమి కోరక శుభప్రతిపాదన సేయువా రకాం
క్షితఫలు లై యకారణము కీడొనరించెడువారు నుందు రీ
క్షితిపయిఁ; గమ్మ దెమ్మెరలు చెమ్మట లాఱఁగ వీచు వేసఁగిన్;
గొతుకక యగ్గి బగ్గు మని కొంపలు మాపును గాదె? మిత్రుఁడా. 169

చ. అలుక నిజా పకారులకు హాని యొనర్చుట కేమి ? వట్టిసా
ధులకును బాధ సేయుటలు దుష్టుల నైజము నూ నిజంబు గా;
నెలుకల, దాని బువ్వ భుజియించుటఁ జంపునో యేమొ చీలి; రా
చిలుకలు దాని కేమి పగ చేసెను ? వానినిఁ జంపు; మిత్రుఁడా. 170

ఉ. చిత్తము కోమలంబగుటచే సహియింపఁడు హింస నుత్తముం;
డత్తఱిఁ గాచరింపఁ గఠినాత్మతచే నధముండు పాల్పడున్;
బుత్తికి యొన్నఁ డైన వధముం బొనరించునె ప్రాణికోటులన్;
గత్తియ గిత్తి రై యినుము ఘాతలు సేయును గాని? మిత్రుఁడా

చ. పలలము మెక్క కుండినను బట్టదు మేనికి సత్త్వ మంచు జం
తులఁ బొరిపుచ్చి తిం డ్రకరుణుల్; మఱి శాకము సారహీనమే?
యిల బలపౌరుషంబులను నెక్కుడొకో యడవిన్ సృగాలముల్
కలభము లన్యజంతువులకంటెను దక్కువ వోకొ? మిత్రుఁడా. 172

ఉ. ఆఁకలి గొంచు రాఁగ నితఁ డాతఁ డటంచును భేద మెంచు నే?
చేకొని సజ్జనుండు నిరసింపక యేనికి నైనఁ బెట్టెడున్;
కోకిలమున్ శుకంబు నళి గోరిన మాత్రము పెట్టి చూతముల్,
కాకుల నవ్వలం దఱుమఁ గాఁ గనుఁగొంటిమ టయ్యె? మిత్రుఁడా.

---

## బాంధవము.

ఉ. బాంధవ మబ్బి ప్రేమ నిరపాయత నూరెడు నింపు కంత సం
బంధము లేనిచోట, నిలపై భగవద్ఘటనంబు గల్గినన్;
సైంధవ మైనయట్టిలవణం బది యెక్కడ? వన్య మైన క
ర్కంధువ దేడ? రెంటికిని గల్గెదె చుట్టఱికంబు? మిత్రుఁడా. 174

ఉ. చుట్టము లైనవారలకు సోఁకెడుబాధల మాన్ప దక్షుఁ డౌ
చుట్టు; మఱొక్కఁ డౌనతఁడు క్రుక్కుట దక్క మ ఱేమి చేసెడున్;
దట్టపుమంచుఁ జిమ్మ నిరతమ్మును దమ్ములఁ ద్రోచు వేవెలుం;
గట్టిఁడు పశ్చిమాబ్ధిఁ బడ నయ్యవి యేమి యొనర్చు? మిత్రుఁడా.

ఉ. ముందుగ బంధుమిత్రులకు మోదము సేయనియట్టివస్తువుల్,
మందుగఁ జేఁదుగా విషసమానముగాఁ దలపోయు సజ్జనుం

డెందు; రసజ్ఞ ఘ్రాణనయశేంద్రియముల్ మును మున్ను సంతసం
బొందనియేపదార్థమును నొల్లమి తెల్లము గాదె? మిత్రుఁడా. 176

చ. ఎడమ మగుకొద్ది చుట్టఱిక మేగును ప్రేమ యు దూల; సంపదం
గుడిచెడువారు గాక వగఁ గుందెడువారలె దూరబంధువుల్?
కడఁకఁ గనిష్ఠికాంగుళియుగంబు నిలంబడ నిల్చు; వంగ వం
గెడు నె యొకించు కైనఁ బరికింపఁగఁ జూపుడుప్రేళ్లు? మిత్రుఁడా.

ఉ. పచ్చగ నున్న నందఱు ను బందుగు లే కడు పారసాపడన్;
వెచ్చగ నున్నచో నడుగు పెట్టరు గుమ్మములోన నొక్కరున్;
బచ్చిక వానకాలమునఁ బట్టినయావరణంబులోనికిన్
వచ్చును వేనవేల్పసులు; వానిని వేసవిఁ జూడు; మిత్రుఁడా. 178

## మాతృవాత్సల్యము.

ఉ. ధారుణి నెవ్వ రయ్యెద రొ ధామము ప్రేముడి కెంచు జూచినన్,
గూరిమితల్లి దప్ప మఱి కొండొకవస్తువు గోచరింప; దే
దారి సనం గ, నావు తనతర్ణక మ్మీల్గిన వంగ లార్చుమిన్
వారక చేఁతపెయ్యమెయి నాకుచుఁ జేఁపుట లేదె? మిత్రుఁడా. 179

ఉ. తల్లి భరింపఁ జాలుఁ జుమి తండ్రికి గిట్టనియట్టిబిడ్డలన్;
దల్లికి గిట్ట కున్న మఱి దైవము కావలెఁ; దండ్రి చాలునే?
పెల్లగ నాడుఁబిల్లి తనపిల్లల గండు హరింప కుండ అం
పిల్లి భరించుఁ గాని, పులిపిల్లల కెవ్వరు దిక్కు? మిత్రుఁడా. 180

ఉ. ప్రేమసమాన మెల్లరకు బిడ్డలపై; ధనికుల్ ఘటింతు రా
రామున నంగరక్షలమరంగ; దరిద్రులు పేయ నేర్తురే?
మామిడిపండ్లు విత్తులను మంచిరసంబున లోనఁ బెంచెడుం
గా? మఱి జీడిమామిడులు గాలికి ధూళికిఁ గాదె? మిత్రుఁడా. 181

చ. కడుపునఁ గన్నకానుపునకన్నను గన్నులఁ గన్నకాను పే
గడితము; కన్నమోహమునకన్నను బెంచినమోహ మెచ్చు గా?
బడలిక గ్రుడ్డు పెట్టినది; బాతున కేమియుఁ బ్రేమ లే; ద ది
క్కుడు గనిపింప దే పొదుగుకోడికిఁ బిల్లలమీఁద? మిత్రుఁడా. 182

ఉ. పేరిముడి పెద్ద గల్గునెడ భీతికి హేతువు లేక పోయినన్
దా మది లేని వెంచుకొని తత్తఱ మొందుట నైజ మేరికిన్;
గోమలతర్ణకంబుపయిఁ గూరిమి బాలుర చేరఁ బోయినన్,
బామర మే మొకో యొగసి పైఁ బడఁ బోరెదు నావు; మిత్రుఁడా.

—:0:—

## సంతానము.

చ. మొఱకుఁగులంబునన్ సుగుణపూజ్యుఁడు పుట్టి యశంబు దెచ్చెడున్;
నెఱకొలనందు నింద్యుఁడు జనించి యడంచును దొంటికీర్తియున్;
గఱకుటనాసకున్ ఫలము గల్గి సువాసన గూర్చుఁ; దీయ నా
చెఱకున రిత్త వెన్నొబ్బడమి చెందినమాధురి మాపు; మిత్రుఁడా. 184

ఉ. అచ్చపుగొప్పవంగసమునం దుదయింప రనేకు లుత్తముల్;
కుచ్చితపుంగులంబునను గూళ లసంఖ్యులు గా జనింతు రా;
నచ్చెరువా? రసాలఫలమందును విత్తొకఁ డుండుఁ; దిక్తపుం
బుచ్చకాయనం దిమిడి బుట్టెఁడుబీజము లుండు; మిత్రుఁడా. 185

ఉ. ఊరును పేరు లేనియుపయోగవిహీను లనేకు లేల? వి
స్తారగుణోత్తముం డొకఁడె చాలు విశాలయశంబు దేరఁ గాఁ;
దారక లెన్నియో చదల దట్టము గాఁ గల వైన నేమి? య
క్కైరవిణీశుచేఁ గద ప్రకాశము నాకస మొందు? మిత్రుఁడా.

చ. అలఘు లనేకు లాస పడునట్టిమహాత్ముల కీశ, దైవ మీ
యిలపయి నేరుఁ గోరనివిహీనుల కిచ్చును సూనులం గడున్;

సలలిత సారసంబున రసజ్ఞుకు నిం పొసరించునించులన్
ఫలములు పుట్ట కేమిటికి పొడుమునిందులఁ గల్గు? మిత్రుఁడా. 187

చ. ఒకజనయిత్రిగర్భమున నుద్భవ మొందిన, నందఱుం బ్రయో
జకులు గ నుండ లే రఫలజన్ములు నుందురు గొంద ఱందులో;
నొకసమయంబునందె కలమోదరసంభవ మైనవెన్ను నో
పికఁ గనఁ బొల్లుఁగాయలు సుబీజము లుండవె యందు? మిత్రుఁడా [188]

చ. జనకుఁడు యోగ్యుఁ డైనఁ, దనుజాతులు నట్టివె యుండ నేర్తురే?
తనయులకారణంబున వెతం బడువార లనేకు లుందు; రె
ట్లనఁగ, శిరంబు పూజ్య మగునంగక మయ్యును బేలకారణం
బున నొరుచేతఁ జిక్కి పలుపోట్లను బొందుట లేదె? మిత్రుఁడా. 189

ఉ. పెల్లుగఁ దల్లిదండ్రులను పేల్చక తిందురు; లాఁతిప్రాణముల్
బెల్లముకన్నఁ దీపి గను బిల్వక యుందురె దుష్టనందనుల్?
నల్లుల వేరిచెమ్మటకణమ్ములఁ బుట్టునొ, వారి నే యొడ
ల్లెల్లను మండఁ గుట్టు? నవుదే యొరునల్లను గ్రోలి? మిత్రుఁడా. 190

చ. పొడుగునఁ దల్లిదండ్రులకు భూరివిషాదము సేయఁ గల్గువ
క్కొడు కుదయింప కుండినను, గొబ్బునఁ జచ్చిన నొండె, మే లగున్;
నుడువఁగ రానివ్యాధుల మనోవ్యధఁ జేసెడుకీటకంబు దాఁ
గడుపునఁ బుట్ట నెవ్వరును గాంక్షయొనర్పరు గాదె? మిత్రుఁడా.

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారిత
సగోత్రపవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరప
రాజవరప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ నామధేయ
విరచిత మగుసూక్తివసుప్రకాశమునందుఁ బ్రథమభాగము.

—)o(—

శ్రీరస్తు.

# శ్రీ సూక్తివసుప్రకాశకము.

——:(o):——

## ద్వితీయభాగము.

### ప్రయోజకత్వము.

ఉ. స్థానము వీడినన్ సుకులజాతు లనాదృతు లప్రయోజకుల్ ;
మానితు లల్పవంశజులు మానిన స్వస్థలముం బ్రయోజకుల్ ;
మానవమూర్ధజం బయిన మాన్య మె కేశకలాప మూడినన్ ;
బూనరె మాలిఁ దుచ్ఛపశుపుచ్ఛజమున్ సవరంబు? మిత్రుఁడా. 1

ఉ. మస్తకమందు నుంచక సమస్తజనుల్ గొనియాడువస్తువున్,
బ్రస్తుతి లేశముం గనక స్వస్థలమం దతినైచ్య మొందెడున్ ;
శస్తసువర్ణభూషణముసంగతి గాంచెడుపీలికుచ్చు, దు
ర్వస్తువుఁ బోలెఁ బిట్టడఁచ వాలముకత్రిఁగ వడంగు; మిత్రుఁడా. 2

ఉ. ఒక్కెడ లేమి వచ్చినఁ, బ్రయోజకు లప్పుడ యాత్మజీవనం
బెక్కడ నైనఁ గందురు; గతి యేది యసంగత రప్రయోజకుల్ ;
నిక్కము, పంకజాకరము నీ రివుఁబాగ విహంగమంబు లే
దిక్కున కైనఁ బోయెదును; దిక్కిఁక నత్తల కేది? మిత్రుఁడా. 3

ఉ. ముంగిటఁ బూర్వజన్మకృతపుణ్యము పెన్నిధి దెచ్చి పెట్టినన్,
వెంగలి యైనఁ దా ననుభవింపఁగ నేరక పాడు సేయు; నీ
సంగతి సత్యమే; కుసుటఁ జల్లగ నాటినపా ల్లభించినన్,
బొంగుమఁ ద్రావ లే కొలుకఁ బోసికొనుం గద పిల్లి? మిత్రుఁడా. 4

చ. ఒరులకుఁ గల్గులోపముల నొప్పుగఁ దీర్పఁగఁ జాలునాతఁడున్,
గర మసమర్థుఁ డౌఁ దనకుఁ గల్గుకొఱంతను బాపుకొంట; క
చ్చెరు వడ నేల? లోకములచీఁకటిఁ బోఁపుసుధాకరుండు, న
స్థిరనిజదుష్కళంకమును దప్పఁగ సల్పఁగలండె? మిత్రుఁడా. 5

ఉ. కాలము రాక మున్నొకటి గల్గినఁ గాచినఁ గాచుఁగాని, పోఁ
గాలము రాఁగ నెద్ది యును గావఁగ లేఁడు ప్రయోజకుం డిలన్;
జాలఁగ గాలి వీచినను, జక్కఁగఁ గాయలఁ బ్రోచు వృంతముల్
నేలను రాలకుండ; మఱి నేర్చునె పండిననాఁడు? మిత్రుఁడా. 6

## కామము.

ఉ. కామము వృద్ధిఁ బొందుటకుఁ గారణ మారయ సంగమంబు గా
దే? మది దానిచే గెలువ నెంచుట యగ్గిని నగ్గి నార్చుటే;
భూమిని నాముఁదాటిగెల, పూఁటకుఁ బూఁటకుఁ గత్తి హత్తెనా,
ఏ మెయి వెట్టినీళ్ళు చెమరింపక యుండెదు నయ్య? మిత్రుఁడా. 7

ఉ. కామముఖారివర్గ మధికంబుగఁ దత్తదభీప్సితక్రియల్
క్షేమము జేయఁ; గావున నుపేక్షయ సంక్షయకారి వానికిన్;
భూమిని బ్రజ్వలించుహుతభుగ్భయదార్చులు, ప్రీతికృల్లస
ద్ధామసమిత్ప్రదానమున నాఱు నె మానినఁ గాక? మిత్రుఁడా.

ఉ. తా దృఢచిత్తుఁ డయ్యు వనితాజనసంగతి కన్నఁ డేగఁ గా
రాసు; తదుజ్జ్వలాంగకవరప్రభ డెందము నీరు సేసెడిన్;
మేదిని లోహ మగ్నులసమీపము నొందెడుదాఁక గట్టి; యా
మీఁదను వెన్నముద్దకును మెత్తని దౌచుఁ గరంగు; మిత్రుఁడా.

ఉ. సన్నిధి నున్న దోషమునఁ జయ్యన నెయ్యము హెచ్చి, నీచు నేఁ
గన్నఁ బొందఁ దోఁచు; నటు గావున నొండ్లను దౌల నుంట మే

లన్నులు; పొన్నగున్నపయి నల్లినవల్లిక యైన, దాపు గా
నున్న నశోకస్థ తుమ్మెదయి నొండెను బ్రాలక యున్నె? మిత్రుఁడా

ఉ. కాంతుఁడు పేద యే నతనిఁ గాంచి చలింతురు; భాగ్యవంతు నే
నంత చలింప కుందు రొరుఁ జూచి పతివ్రత లాత్మయం; దయ
సాక్రాంతముఁ జూచినం గదలుఁ గాలులు వచ్చినయట్లు సూచికల్;
శాంతల వజ్రమున్నను జలించునె యించుక యైన? మిత్రుఁడా.

---

## క్రోధము.

ఉ. కోపుర యైనచో బుధులుఁ గొంకరు దుష్క్రియ లాచరింపఁ గాఁ;
బాపము దాన వాగలను బైకొని తేజము మాపకున్నె? సం
దీపితుఁడై తమంబును మథింపఁగఁ జాలినకీలి ధూమజా
లావహ్యత్ప్రకాశుఁ డగు నన్ని దహించుటఁ జేసి; మిత్రుఁడా 12

ఉ. తామస మున్నమానవుఁడు తా మని యాట విరుద్ధమే? నిజ
క్షేమముఁ గోరువాఁడు నిరసించుట మేలగు మంచికా; టిలం
బామి నయంతమాత్రమున బగ్గున మండెనునగ్గిపుల్ల బు
గ్గా; మఱి మండకుండునది యాపద నొందదు గాదె? మిత్రుఁడా.

ఉ. కోపము రాను కోవిదునకుం దనకుం బరు లేమి చేసినన్;
గాపురుషుండు తద్విధమునం బరమక్షమ పూనఁ జాలునే?
బాపుర! వాఁడి రాదు గద పైఁడికిఁ గాలిచి కొట్టి రాచినన్?
పైఁపదు గాదె యట్లినుము, కాతఁ బూనును గాని? మిత్రుఁడా.

ఉ. చాలఁగఁ గోప మెత్తినను, జల్లనిమాటల శాంతిఁ బొందెడుం
బోలఁగ సజ్జనుండు; మఱి పొందక దుష్టుఁడు చూపు దౌష్ట్యమున్;
బాలకుఁ బొంగు రా, జలము పైఁ జిలుకంగ నడంగుఁ; గాని దు
స్తైలము బగ్గున న్నెగసి ధామము గాల్చును గాదె? మిత్రుఁడా. 15

చ. తులువకు తుచ్ఛవాక్యములఁ దూలఁగ నాడినయంతమాత్రచే,
నలుక జనించు నెట్టులు మహాత్ముల శీతలమానసంబునన్ ?
జెలియలికట్ట నిల్పి తనచేతఁ దృణాగ్నిని వీచి వైచినన్,
జలధిజలంబులం దుడుకు సంభవ మయ్యెడు నయ్య ; మిత్రుఁడా. 16
ఉ. ఓపికతో బదుల్ సలుపు నుత్తముతోడను మేల మొప్పు; ముం
గోపులతోడ నెన్నఁ డది గూడ; దనర్థము సంభవించుఁ ; గ్రీ
డాపరబుద్ధి నాటకుఁ గడంగిన నందము కందుకంబుతో;
నాపని గాజుతో సలుప నర్హమె గర్హ్యము గాక ? మిత్రుఁడా. 17

ఆశ.

ఉ. ఆసకు మేర లేదు; తమయక్కఱ కుండినఁ దృప్తి లెస్స; పే
రాసకుఁ బోయినం, గరము హాని యగు; న్నిజ మెట్టు లన్న, బు
ష్పాసవపూర్ణకుంభమునయందున తేనెను మక్షికాక్షుధా
త్రాసము వాయదే ? మునిఁగి ప్రాణము గోల్పడ నేల? మిత్రుఁడా
చ. కలిగినమాత్ర మిచ్చిన వికాసము దోఁచును యోగ్యహోమునం
దెలమి దురాశపాతకున కెంత యొసంగినఁ గల్గ నేర్చునే ?
జలదము వర్షముం గురియ, సారపు నేలను ఘాసపూలికా
చ్ఛలమున రోమహర్షణ మెసంగు; నెడారి న దెట్లు ? మిత్రుఁడా.
ఉ. ఇచ్చిను దృప్తి యున్నఁ దృణమే యొక మేరువుగాఁ దలంచి తా
హెచ్చుగ సౌఖ్యమొందును; నతృప్తియ యున్న విరుద్ధమయ్యెడున్;
బచ్చిక నల్లుకొన్న తెర, పచ్చలకంబపుఁజండమామఱా
మెచ్చులమేడ చెల్ది కకివీనికి మేడయు మెచ్చె మిత్రుఁడా. 20
చ. పరవనితార్థలోభ మది పాపము పాపము నమ్ము; దానికిం
జొరక సుఖించు టే సుఖముఁ చొచ్చినఁ దప్పక ముప్పు వచ్చుఁ గో

పరతను బోరి పోరి వృషభంబులు పొందును శృంగభంగమున్;
బొటియలు ద్రవ్వి ద్రవ్వి తుది బోనున నెత్తురు చిమ్మ; మిత్రుఁడా.

---

## జుగుప్స.

ఉ. మ్రుక్కడు లేవపుంబనులు మొక్కలులై యొనరించుచుండియున్,
మ్రుక్కఱు సిగ్గునన్ ఘనులఁ జూచియు; నీచుల కేవ మున్నదే?
కుక్కలు పెంటగోతులను గొల్లున నెంగిలిపూటి కుద్ధతిన్
మిక్కిలి కాటు లాడుచు, శమింపవు కుంభులఁ జూచి; మిత్రుఁడా. 22

చ. కలుషము లాచరించుట కకల్మషుఁ డెంతయు జంకుఁ; గాని పం
కిలుఁ డిలఁ గొంకు నెట్లు, పరికింప మఱింతగ నుత్సహించుఁ గా?
కలపెనుబొచ్చుగుంట గని యావలఁ బోవును గోవు; దానిలోఁ
గులుకుచుఁ గాఱుదున్న పడి కొట్టిన లేవదు గాదె? మిత్రుఁడా. 23

ఉ. ఎప్పుడు రోఁతలోఁ బొరలు నెద్దె కదే ప్రియ మాను; యోగ్యపుం
జొప్పలు ప్రాణకొడ్డములె; నుంతయు నింపులుఁ గావు వానికిం;
గుప్పునఁ గంపు కొట్టుచెడఁగుళ్ళినపుల్గడుల నుంచుపుప్పికిం
గప్పుర మిష్ట మానె? యది కాంచిన నష్టమె కాక; మిత్రుఁడా. 24

ఉ. భాగ్యము చాలఁ గల్గినను, బాడుకొనంబులు పీడ రమ్మనల్;
యోగ్యులు పేద లయ్యుఁ దమ యుత్తమవర్తన మాన లేరు; రా
డ్భోగ్యపదార్థ ముండినను, బుచ్చినయెమ్ములు దెచ్చుఁ గుక్క; లా
రోగ్యము దప్పి ప్రుక్కియు హారుల్ పులు మేయు నటయ్య? మిత్రుఁడా.

## ఈర్ష్య.

చ. పలుగులు గన్నులుండి యును బాగగువస్తువుఁ జూడ నోడి లోఁ
గలఁగుదు; రైన దానికిని గా దది లోపము; వారిపాప మే;

వెలుఁగును గాన లేకొకగవిం బెనుఁజీఁకటిలోన నుండు న
బ్బిలములు; దాన నాకొఱఁత వెల్గుదె వానిది గాక? మిత్రుఁడా. 26

ఉ. చెన్నఁటు లాత్మవస్తువులు చెడ్డవి యైనను గారవించి, సం
పన్నగుణంబు లైనఁ బెఱవారివి దూఱుదు రోర్వ లేక; యె
ట్లన్నను, గాకిమూఁకలు నిజాత్మజులం బ్రియ మారఁ బ్రోచుచుం,
దన్నుచు నుండవే పరభృతంబులబిడ్డల రేఁగి? మిత్రుఁడా. 27

## తొందర.

చ. సరగ జనించి వే పొదలుసర్వపదార్థములు న్నశించు నా
సరణి న; తద్విరుద్ధములు శాశ్వతముల్; తొర మేలు గాదు గా?
పెరిఁగెడు వేఁపు గాఁ జినుకు పృథ్విఁ బడం జిగిలింత; నిల్చు నే?
చిరగతి మొల్చి వృద్ధి యగుచింత ధ్రువం బగుఁ గాని; మిత్రుఁడా.

ఉ. వేగిరపాటుచేత నొకవేళను గార్యము గానె చూడు, తా
జాగున కోర్చి నెమ్మిగను సాగఁ గ నిచ్చినదాని కీడు రా
దొగు గనఁబడుం; బనఁటి నూఁదర గొట్టినయంటిపండ్లకుం
బాగు గ వచ్చు నే, ముదిరి సంసినపండులతీపి? మిత్రుఁడా. 29

ఉ. ఓరుపుఁ బట్టుఁ దల్గిన, ఫలోదయ మూఁ గృషికిం దనంత నే;
సారెకుఁ దత్తఱించిన, ననడ్డగ నుండిన, వ్యర్థ మయ్యెడున్;
బోరల గ్రుడ్లులం బొదుగఁ బుల్గులు పెక్కుదినంబు లోపికం
గూరిమి, బోద లొఁ; బగులఁ గొట్టిన, మానిన, నౌ నె? మిత్రుఁడా. 30

చ. విడువక నాఁడునాఁటికిని వృద్ధి యొనర్చినఁ గాక యొక్కచే
విడుతను జేయఁ జూచినను, వేగుఁ నసాధ్యము లౌను గార్యముల్;
కడుపున శుక్లపక్షశశి కైవడి వర్ధన మొందునర్భకుం
బడలక మోయఁ దల్లి; యొకమా టటు పూనఁ దరంబె? మిత్రుఁడా.

ఉ. చక్కఁగ నుత్సహించి పని సల్ప ఫలించు నె రూఢి; వ్యర్థ మా
నొక్కపుఁ డైన మానుకొన కోపికఁ జేసిన రిత్తవోవు నే!
చొక్కపుటంటిపువ్వు విడుచుం దన రేకుల; గల్గు నత్తముల్;
దక్కు నొకప్పు; డైనఁ మది దక్కె వె కొన్నిటియందు? మిత్రుఁడా.

---

## శాంతత్వము.

చ. దురుసుఁదనానఁ బైఁ బడును దుండుడు; కట్టులు దీర్ఘదర్శి వే
గిర పడ కుండు వెంషి; త్రుటి కి మ్మన కుండిన, వాఁ డె పోవు; భా
స్వరఘటికారమందు, నిముసంబులముల్ తన పైకి రాఁ గఁ, దొం
దర పడి గంటముల్, మరల దానిని బైకొను నయ్యె? మిత్రుఁడా.

చ. అలఁతులకుం బదుల్ మొనయు నయ్యె మహాత్ముఁడు? వారు ప్రేలుకా
ఱులు తనుఁ గానియట్టులు నెఱుంగనియట్టులు గా నటించెడున్;
ములుచఁదనంబునన్ భషకముల్ తనముందఱ భౌకరించినం,
గలభము ఘీంకరించెడు నె క్రిమ్మఱ రోసముఁ జెంది? మిత్రుఁడా. 34

ఉ. శాంతులఁ జూచి మోఱకులు చాలమి వెట్టుదు రిం తె; వారివి
క్రాంతి దురాగ్రహోగ్రులకుఁ గల్గు నె? చెయ్యలు వజ్రతుల్యముల్;
వింత యె? కొండ కోడి యడవిం దహియించు దవంబు; కొండ నిం
తింతలు గాఁగఁ గోసి ప్రవహించును జల్లని నీరు; మిత్రుఁడా. 35

ఉ. క్రోధులచేఁతలం జెడినఁ, గొంత యినం గల దాస మేదినిన్;
సాధుల కల్కి వచ్చినను, సర్వము శూన్యము గాక యుండు నే?
సౌధము నగ్ని యంటుకొనఁ జక్కఁగఁ దక్కును గోడ లైనఁ; నం
భోధి యు పొంగె నేని యవి భూమిని బూడక యున్నె? మిత్రుఁడా

చ. కనులను నిప్పుకల్ గురియఁ గాఁ బఱు వచ్చుమహోగ్రకోపి యుం.
దనకడ నోరు పున్నయెడఁ దక్షణమం దె ప్రశాంతుఁ డయ్యెడున్;

ఘన మగుధూళితోడ వడగాడ్పు భీకరభంగి వీచి, చి
క్కనితడివట్టివేళ్ళతడకం బడి చల్లన గాదె? మిత్రుఁడా. 37

ఉ. కాంతుల కగ్గుఁ జేసినను, సంతస మొందునె దైవ? మక్కటా!
యంతకు నంత వారలకు నప్పుడ గట్టిగఁ గట్టి కుడ్పఁడే?
కాంతి నడంచుఁ బున్నమను గల్వల తేనికి భూమి యడ్డ మై;
ధ్వాంతము కోటికోఁడ లయి దానిని మ్రింగద దాన? మిత్రుఁడా. 38

ము.

చ. పలుకడగండ్లు వచ్చినఁ, బ్రపంచమునందు వినీతు లోర్చి య
వ్వలఁ దల యెత్తికొందు రి సరివారలలోఁ? జెడిపోదు రుద్ధతుల్;
హాలికకుఠారఖండితము లై మరలం జిగిరించు శాఖు, లీ
యిలపయి నిట్టతాడులు న సేఁతలు రూపఱుఁ గాదె? మిత్రుఁడా.

చ. శ్రిమ తమ కైనచో హృదయసారము గల్గినవారు లోనిదుః
ఖము వెలిపుచ్చ కుండెదరు; గాని తదన్యు ల టుండ నేర్తు రే?
తమకమునన్ హుతాశనుఁడు దాహము సేయుచు నున్నఁ, జేవమా
లములను బుట్టు నే వెదుళులం బలె ఘోరరవంబు? మిత్రుఁడా. 4

ఉ. ప్రబ్బుచు సంభవించెడువిపత్తులు చుల్కనివారిఁ బట్టి త
బ్బిబ్బొనరించుఁ, గాని వెఱపింపఁగ లేవు సుమీ మహాత్ములన్;
మబ్బులఁ దూలఁ బుచ్చుఁ బవమానము చిత్తము వచ్చినట్లు; తా
గుబ్బలులం గదల్ప సమకూడునె యెన్నఁటికైన? మిత్రుఁడా. 41

ఉ. అవడ లొంది చెన్నఁడియు నార్యులు వెన్నడ రవ్వ సేయ నే
కాఁపుర; మట్లు సంపదలుఁ గల్గును; గాలవశంబు లన్నియున్;

దీపక వల్లమబ్బు లయుదేర మఱుంగుచుఁ,బోవఁ దోఁచుచున్;
జాబిల కోర్చి రాజు రుచిసంపద నొందఁడె ముందు? మిత్రుఁడా. 42

---

## పరితాపము.

ఉ. ఇంక మ టెంచు మారి నోశఁ శ్రీ వలెనే? నిజశక్తి విద్విష
ద్బృందము నోర్చి తా న కొను వీరుఁడు; రాజ్యము వీరభోజ్యమే;
పందు లెలుంగు లేనుఁగులుఁ బట్టము గట్టెనె సింహడింభమున్
మందలకున్? స్వకీయమహిమం బ్రభు వయ్యెను గాక; మిత్రుఁడా.
ఉ. తేజము గల్గువాఁ డవమతిక్ సహియింపఁగ లేమి యొచ్చటన్
నైజము; వానికి న్వయసునం బని యేమియు లేదు చూడుమీ;
తేజున మీఁది దాఁ బ్రమిదదీపము, జక్కఁగ వెల్గ నిచ్చునే,
రాఁజుచుఁ గ్రిందిఁ బ్రమ్మిడను రాలినదీపపు మొగ్గ? మిత్రుఁడా.
ఉ. మెత్తనివాని నందఱు ను మిక్కిలి బాధ యొనర్తు; రాగ్రహో
యత్తునిజోలి కేగ రొకరైనను; నొవ్వన కేది మెప్పిలన్?
మొత్తును జాలి లే కనిశమున్ ఘటకారుఁడు పచ్చికుండఁ; గిం
చిత్తు దాఁకఁ బోఁడు గద చిచ్చునఁ గాలుఘటంబు? మిత్రుఁడా.
చ. తలఁకెడువారి దుర్మదులు దర్పితులై బెదరింతు రూరకే;
తలపయిఁ దన్నువారలకు దండము వెట్టుచు లొంగి యుండరే?
కలఁకుల కేగువారిపయిఁ గే లటు సాఁచును మత్తవేనుఁగుల్;
గలఁగుచు మావటీలఁ గని కాళ్ళను మ్రొగ్గును గాదె? మిత్రుఁడా.
చ. బెదరిన లేఁగి పైఁ బడును భీకరభంగిని దుర్జనుండు; తన్
గదిమి యెదుర్చుచోట నిజగర్వము సర్వము దూలి పోవుడున్;
మొదట మొఱంగి కుక్క తఱుముం గద యోడనిఁ బాఱువారలన్;
దుదిఁ దను ద్రోయువారిఁ గని తోఁక ముడుంచుక పాఱు; మిత్రుఁడా.

చ. నరుఁడు ప్రతాపవంతుఁ డయినం, దను మీఱినవారి తేజమున్
పరుస హరించి, లోఁబడినవారికి సొంపు నెంపుఁ గూర్చు; భా
స్కరుఁడుదయాద్రి నెక్కి పయిఁ గ్రాలెడుచుక్కలఁ ద్రొక్కి, కాంతిభా
స్వరకనకాభిషేకమును సల్పు నగాగ్రములందు; మిత్రుఁడా. 48

ఉ. శూరుఁడు దైవలోపమున స్రుక్కియు ధీరత ముం దె పోయెడున్;
భీరుఁడు వల్ల దప్పినను, బెగ్గిలుచు న్వెనుదీయు ముందు నే;
నేరుపు దక్కి బాహువులు ముణింగిన ముందఱ కే ముడింగెడున్;
ధారుణిఁ బాదశాఖ లటు దా మొనరించు నటయ్య? మిత్రుఁడా. 49

చ. అరయఁగఁ బాఱుఁబోతు మొనయం గలఁడయ్య ప్రతాపవంతు, డ్రీ
విరహితుఁ డై యరాతికిని వెన్నిడి యూడనిఁబాఱుఁ గాక ? తా
నరుణగభస్తిదిక్కు మొగ మై యెపు డైనను నీడ పోవఁ గాఁ
జొరవ యొనర్చు నే, మఱుఁగఁ జూచును గా కడలొంది? మిత్రుఁడా.

ఉ. ముక్కున నావి గల్గఁ, బెఱమూఁకల నాకుల పెట్టుఁ గాని, తాఁ
జిక్కఁ డరాతి కాయుధము చేపడ నీయఁడు శూరుఁ డెన్నఁడున్;
గ్రక్కున వేగు రైనను ముఖాముఖి డీకొని తేర నేర్తు రే
యొక్కన,జీవ మున్న పులి నొండెను, దన్నఖ మొండె? మిత్రుఁడా.

చ. తొడరి మహామహంబు తనదుస్సహవిక్రమ మొక్కయల్పపై
నుడుగక చూపు నే; తగుసమున్నతుమీఁద న చూపుఁ గా కిలం?
బిడుగు భయంకరార్భటిని బిల్లుపయిం బడు నయ్య, మిన్ను ద
న్నెడి మెడలన్ మహాద్రిధరణీధ్రములం బడుఁ గాని? మిత్రుఁడా. 52

ఉ. క్రౌర్యము నూపుకూర్మి యనెడఁ గ్రౌర్యము నూపుట యే ప్రశస్తపుం
గార్యము; ప్రాణహానికిని గారణ మా నుజనత్వ మయ్యెడన్;
శౌర్యముతోడ బున్న మని సర్ప మెదిర్చిన, దుడ్డుఁగఱ్ఱతో
దోర్యుగ మొప్ప నొప్పగును; దోసిట నొప్పిన ము ప్పె; మిత్రుఁడా.

చ. చతురుఁడు దూరభీరుత యుసమ్ముఖశూరత సూపు; వాచనా
చతురుఁడు కేవలంబతనిచర్యలకు న్విపరీతకార్యుఁ; డు
ద్ధతు రిపు డాయునంత కసి దాఁగి పదంపడి వాఁడి సూపు; మున్
గృతి బహిరంగ మైనయొఱ తీఱనని న్వైనుదీయు; మిత్రుఁడా. 54
చ. తనకు ఘటిల్లుహానికిని దప్పుకొనన్ వెర వొండు లేనిచో,
మనుజుఁడు నైజదేజమును మానక చూపుట లెస్స; యెట్లనన్,
శునకము వెంట నంటి, తనుఁ జాల్కొనిఁ జంపగ వచ్చుచున్నఁ, జెం
తను దయ వైన లేనపుడు దాఁటదె పిల్లి యెదిర్చి? మిత్రుఁడా. 55

---

ఘనుఁడు.

ఉ. ఎంతయు నాస యుండినను, హీనుఁడు తోఁడెము నే గ్రహించుఁ; గా
సంతయుఁ జిక్కకుండఁ దనయాసను దీర్చుకొనున్ ఘనుండు; నీ
రంతికమందు వెల్లివిరియం గొనుఁ గొంచెమె చిన్నకన్న; మొ
క్కింత కొఱంత లేక కడు పెల్లను నింపదె చెర్వు; మిత్రుఁడా. 56
ఉ. హీనుఁడు వానిపొట్టకొఱకే పొర లాడును; గాని మానముం
బూనినవాఁ డనేకజనపోషకపౌరుషకారి యయ్యెడున్;
శ్వానము దానిమట్టు కొకశల్యము నోర గ్రహించు; ధీరపం
చానన మెన్ని యో తినఁగఁ జాలుగజంబు వధించు; మిత్రుఁడా. 57
చ. ఘనులు నునుర్వి నల్పులకుఁ గానఁగ వత్తురు వారియట్ల; త
జ్జనులకు దూరయోజనము చాలదు గావున; వారలంతు లే?
కనులకు సూక్ష్మరూపమునఁ గన్పడునంత నె ఋక్షముల్ నభం
బున నటు లుండు నయ్యు? యవి భూమికి నెన్నుఁడు గావె? మిత్రుఁడా.
చ. ఘనుఁడు సమస్తదేశముల గౌరవ మొందును; నీచు డైచ్యమొం
దును; నవివేకిచెంత నిది దోఁచు విరుద్ధత; నెట్టు లన్న, నెం

డును వలకేలు మన్నన గనున్; బెఱకే లవమాన మొందు; నై
నను విపరీత మై యిది గనంబడ దే శిశునందు? మిత్రుఁడా. 59

చ. పుడమిని వన్నె వాసి గలపూరుషుదోషము స్వల్ప మైన, వె
ల్లడి యగు చుండుఁ; బాపి పదిలక్షలు చేసిన, బైట వచ్చు నే?
మడుఁగుజిలుంగుఁబుట్టమున మ న్నొకయించుక సోఁకినం గనం
బడిరొడు; నీలిగుడ్డ చెడ మాసినఁ గానఁగ రాదు; మిత్రుఁడా. 60

చ. అనదలు నైతముం బ్రభుకటాక్షము గల్గిన, వన్నె గాంచెదర్;
ఘను లయినం బ్రకాశమును గాంచఁగ లే రది లేక యున్నచో;
నినకిరణాప్తిచేఁ దుఱఁగలించుఁ దళత్తళ లూతతంతువుల్;
గన జరబాఱుఁబోఁగులును గా కటు భాసిలు నెట్లు? మిత్రుఁడా. 61

ఉ. గౌరవలాఘవంబులను గాంచి మహోఘననీచవృత్తులన్
ధారుణి నుండఁ గల్గెదరు దైవమునాజ్ఞ నె యుత్తమాధముల్;
పౌరుషశక్తి గా దది; విభానురశుద్ధనువర్ణధర్మముల్,
తేరఁ దరంబె యిన్మ్రననుఁ దీఱని కోఁకల నైన? మిత్రుఁడా. 62

ఉ. ధీరుఁడు సేర వచ్చినను దిగ్గన లేచి సమంచితార్హ స
త్కారము లాచరింప వలెఁ; దక్కినచోఁ దన కే కొఱంత సూ;
సూరుఁడు రాఁ బిరుండుజను సోమరి యఁదురు; కాల్యకృత్యముల్
నేరుపుతోడఁ దీర్చునతనిన్ సుజనుం డనుకోరె? మిత్రుఁడా. 63

—:o:—

## దుర్జనుఁడు.

ఉ. కుంభిని వేషధారు లొకకొందఱు గల్గుటఁ జేసిఁ భానురా
దంభవిశుద్ధమూర్తులకుఁ దారసిలున్ సిలుఁగుల్ నిజంబు; వి
శ్వంభర నుల్లముత్తెములు సంభవ మాటను గాదె యెవ్వరున్
శుంభదమూల్యమౌక్తికమణుల్ గని నమ్మరు ముందు? మిత్రుఁడా. 64

చ. పరులను జిక్కులం బఱుప భావమునందుఁ దలంచువాండ్రయో!
గురుతర మైనచిక్కులఁ, దగుల్కొను చుందురు దా మె ధారుణిన్;
ద్వరితగతిం గవాటములు ద్వారనిరోధము సేయఁ బోయి, దు
ర్ధరదృఢశృంఖలార్గళవిధాననిరుద్ధము లౌను; మిత్రుఁడా. 65

ఉ. ఎంచఁగ మాయచే నొకని నేని జయించు నొ కేఁ డొ చెప్ప లే;
వంచితసత్స్వభావమున నందఱఁ దాఁ ద్రుటిమాత్ర గెల్చుఁ; బై
మించుల నెన్ని చూపినను, మెక్కఁ డొకండు ముసిండిపండు; ద
ర్శించిన నేనిచిత్తము హరింపదు చూతఫలంబు? మిత్రుఁడా. 66

ఉ. వంచకుచేత నొక్కమతి వంచితుఁ డైనమనుష్యుబుద్ధికిన్
మంచిజనుండు నైన మొకమాయకుఁడుం బలెఁ దోఁచు చుండు; నె
*ల్లంచవ, వేఁడిపాల్ మొదల లోకప్పుడు చుఱ్ఱున మూతి గాల్చినం,
గొంచక పిల్లి త్రాగదు నె గొబ్బునఁ జల్లనిపాలు? మిత్రుఁడా.

ఉ. దొంగను బట్టుకొంట కొకదొంగ యె కావలెఁ; గాన నట్టివో
టం గపటస్వభావునఁ డకుల్కలు సేయక నెగ్గ నేరఁ డే
భంగి వనన్, విదూరజనిభంబులు గ్రుద్దర మోడ్చి, మానికే
వం గయికోక యాఖువులఁ బట్టు నె బావురుగాఁడు? మిత్రుఁడా. 68

చ. పలువురక్షేమవృద్ధులకు భంగముఁ దెచ్చెడులోకకంటకున్
మెలఁకువ నెట్టు లైనఁ బుడమిం గడతేర్చుట నీతి; యి ల్లనం,
బొలమున నున్న సన్న వరి మొక్కలకుం దనవామరంబునన్
సిలుఁగులు దెచ్చుతుమ్మలను జెల్కరి గొడ్డటిచేత? మిత్రుఁడా. 9

చ. పలువ లొకప్పుడుం దమకుఁ బట్టెడుగూడు డిడనట్టివారిపాం
తలఁపను బోక, తిన్నయిలు నాశ మొనర్పఁ గఁ జూతు రే మొకో?

---

*ల్లంచన, జాలసంచికిత మైనవిసారకులంబు. నీల మే
ఘాంచితబింతముం గని భయంపడి మిట్ట వె నీళ్ల? మిత్రుఁడా.

యెలుకలు వెండి పైఁడి గలయిండు లనేకము లుండ, మెండుగాఁ
గలుఁగులు ద్రివ్వి వంటయిలు గాదెలు పాడఁజేయు; మిత్రుఁడా.

## ఆపత్సంపదలు.

చ. కలిమి యు లేమి సౌఖ్యము ను గష్టము నీయవి యెల్లవారికిం
గలుగును గాలభేదమున; గాము సుఖీ తిర మిందు నొక్కఁడున్;
జలధిపరీత మాధరణిచక్రమునం గలసర్వజంతుజా
తుఁకు నహర్నిశల్ వెలుఁగు దుస్తమ మబ్బుట లేదె? మిత్రుఁడా. 71

చ. ఇలఁ దనుయాత్ర సల్పునరుఁ డెప్పుడు నప్పటినైజసంపదం
దలఁచుక పొంగు టాపద మనంబున నెంచుక కుంగు టొప్ప ది
మ్మర్ల భ్రమియించుచక్రమున మున్ బయి నుండినయాకు క్రింది దౌఁ;
దొలుతను గ్రింది దౌనరము, తోడ నె మీఁదికి వచ్చు; మిత్రుఁడా. 72

ఉ. సంపదయందుఁ బొంగు ను, గృశత్వము నాపదయందుఁ, దోఁచు స
న్నంపుజనంబులందు; ఘనునందు వికారము దోఁప దెప్పుడున్;
బెం పయి వర్షకాలమున వేసవియందు దడు గంట గుంట; చిం
తింపఁ గ నంబురాశి యొకతీరున నే సత మం దుఁ? మిత్రుఁడా.

ఉ. సంపద వచ్చినం, బరవసంబున నీచులు గట్టు మీఁటి హిం
సింపఁ గఁ జూతు రొంటులను; జేయరు నూ ఘను లవ్విధంబునన్;
ముంప దె గ్రామముల్ వఱదపొల్లునఁ దొల్కరి నేఱు? సంద్రమో,
గుంపులు గుంపులై నదులు కూడిన, దాఁటదు వేల; మిత్రుఁడా. 74

ఉ. ఆపద రాఁ గలప్పుడు మహాంబుధి నుండినఁ, గాన నున్న, భూ
స్థాపన మొందినన్, గుహల దాఁగినఁ, దప్పక వచ్చి తీఱకున్;
జేఁపలతండముల్, సొగసుజింకలగుంపులుఁ గూర్మసంఘముల్,
ద్వీపిసమూహముల్, పొరయ వే భయ మయ్యెయి చోట్ల? మిత్రుఁడా.

చ. తనకు నదృష్ట మేగడియుదాఁకను బాగుగ నుండు, నంతదా;
కను జద లంటు; నాపదలు గల్గవుపిమ్మటఁ గూలఁ గాఁ బడున్;
బొనరిచినట్టికాగితపుబుట్టయు దీపము వెల్గునంతకున్
జను గద యుప్పరంబున? ననంతర మే మగు నయ్య! మిత్రుఁడా.
చ. జనుల కదృష్టకాలమున సర్వము దాని కదే లభించెడిన్?
గన దురదృష్టవేళల నొకందు ను జేకుఱ; దున్న దూడెడున్;
వని ననకారునం బ్రసవపల్లవపక్వఫలంబు లొందు; నె
ర్వనిచిన, నాకు రాలుతటి నొందు నె, మోడ్వడు గాక? మిత్రుఁడా.
చ. అరయఁగ సర్వశూన్యుఁడు మహాధనవంతుఁ డగుఁ క్షణంబులో;
నురుధనికుండు పేద యగు నొక్కనిమేషములోన; నెట్లు నా,
నరుదుగ రి త్త దోఁచెడుమహాబిల మట్టె మొగుళ్ళచే నిరం
తర మగు; మబ్బు లున్నది పదంపడి వట్టిది గాదె? మిత్రుఁడా. 78
చ. ఇలపయి మేలుగీ ళ్ళనుభవించెడువేళ హఠాత్తుగా నవ
స్థలు విపరీతముల్ దొడరఁ, దాల్ప భరం; బయినం గ్రమంబునన్
జులుకన గాదె? వెల్తురునఁ జొచ్చుచు నీడకు, నీడ నుండుచున్ .
వెలుఁగునకుం జటుక్కునను వెళ్ళఁగ గనుల్ గను నెట్టు? మిత్రుఁడా
చ. ఘనసుఖదుఃఖముల్ సమము గా లభియించుచు నున్న, సౌఖ్యపుం
దినములు వేగినట్లు కడ తేఱవు కష్టదినంబు లెంతకున్;
గనదురుచంద్రికావిశదకాంతిమనోహరపూర్వపక్షయా
మినులవలెం దమిస్రలు గమించుట లేదు గదయ్య? మిత్రుఁడా. 80
చ. తొలఁతటికంటె మీఱు గుణదోషము లెక్కటునందు సాధ్వసా
ధుల కటు గాన నే యశము దుర్యశ మందున హెచ్చు వారికిన్;
వలనుగఁ గాల్పుచే నగరువత్తికినిం బొగచుట్టకుం, బరీ
మళము ను గంపు హెచ్చి సభ మాన్యత దూష్యత దే వె? మిత్రుఁడా.

ఉ. పేదలఁ గాన లేదు సుమి పెద్దయు సంపదలోన నల్పుఁ; డే
మాదిరి నైన నక్కఱలిమి మాసిన నప్పుడు గాంచుఁ గాని; యా
గా? దినినాథు పెన్వెలుఁగు గల్గఁ గఁ జుక్కలఁ బాప గాంచు నే
యాదటఁ, జిమ్మచీఁకటి రయమ్మునఁ గ్రమ్మినఁ గాక? మిత్రుఁడా.

ఉ. పేద నటంచు నోరఁ దనపేరివులు నూపిన, హీనుఁ డంచు న
ల్పాదరణం బొనర్తు; రనయంబు గభీరతఁ బూన నెన్న యాఁ;
బావసమీపమందుఁ బడి శ్వానము నోరు ను గుక్షి నూపినన్,
మేదిని గంజి వోయుదురు; మెండు గ నేనిక కీర? మిత్రుఁడా. 83

ఉ. స్వాంతములోన, లేమి గలయప్పుడు చింతల కేమి వింత? య
త్యంతము కల్మి యున్నపుడు నవ్వి జనింపక మాన వెట్టులో;
ధ్వాంతము, వెల్గు లేనితఱి దట్టము గాఁ గనిపించు టబ్రమే?
కాంతి గలప్పుడుం జెనక కన్పడు నీడలపేర; మిత్రుఁడా. 84

చ ఇనుముల నెగ్గులాడెదరు హింసరియు లంచు వివేకహీను లై,
యిడుమలె లేక యున్నఁ, దమ రెట్టు లెఱింగెదరో సుఖస్థితుల్?
మిడిమిడియెండలో నడిచి మిక్కిలి డస్సినఁ గాక శక్యమే,
పుడమిని జెట్లనీడసుఖమున్ జలసౌఖ్య మెఱుంగ? మిత్రుఁడా. 85

చ. ఎవనికి నెట్టిప్రవృత్తి ఘటియించును మే ల దె కీడు దెచ్చెడున్;
భువి ఘనవృత్తిఁ జేడ్వడినఁ, బొందఁడు నిందను; లాఁతి నొందెడున్;
దివి శశి వృద్ధి నొందు క్షయముఁ దిరిసమ్మరుచుం గను, నింద్యుఁ డా నె;మా
నవు మెయి కుట్టి రూప మెఱుసల్లి పడిం బడుఁ గాని? మిత్రుఁడా. 86

చ. ఒకరికి దేనిమూలమున నుర్విని లాభము గల్గు చుండు, నే
డొకరికి దాన నే మిగుల నొప్పమి యుప్పతిలుం; బయిళ్ళఁ బ
చ్చిక హిమబిందుబృందములచేఁ గని గందళ సుందరం బగున్;
జకచిక లాడుచూ తెజలజంబులడంబు లడంగు; మిత్రుఁడా. 87

చ. విరవులు వేయి రైనఁ బృథివిం దొలఁగించు నె దుర్విపత్పరం
పరలు, జగత్ప్రదీపకపవపారకృపారసపూరసత్కటా
క్షురుచులు పర్వ కున్న? గుమి గా మినుమిన్కని గ్రిమ్మరుంగులుం
బురువులచేతఁ జీఁకటులు బోవు నె వెన్నెల రాక? మిత్రుఁడా. 88

---

## ధనము

ఉ. లోకమున గల్గువాని కితరుండు ను సేవ యొనర్చుఁ గూళకుఁ;
బకమును సాధు వైనఁ దనబంధుఁడు గూడను సేవగించెడున్;
జకమగ మేపుఁ బాఁడి గలనట్టిను బందెలదొడ్డికావరిఁ;
మిక్కిలి గంగిగో వయిన మేపు నె వంజను గాఁపు? మిత్రుఁడా. 89

చ. ఫలము నగణ్య మీయఁ గలభవ్యపదార్థ మొకండు గల్గినన్,
ఫల పడ లేదు పేద కది, భాగ్యము గల్గినవానికిం బలెన్;
బలమునఁ జేసి దున్నక య పండె నుమాన్యపుఁగొండ్రి యుండినన్,
హాలికుఁడు విత్తు లేనియతఁ డైన ఫలించు నటయ్య? మిత్రుఁడా. 90

ఉ. న్యాయసమార్జితం బగుధనం బస దైన, ముదంబు పెద్ద; య
న్యాయపుసొ మ్మదెంత యయినన్, సుఖ మీయమి కాకపాయమున్
జేయును; నేల రాలొకలుచుఁ జీమ గడించి భుజించు హాయి గా;
రాయిడి నెలక విన్నులు సొరంగముఁ జేర్చి నశించు; మిత్రుఁడా. 91

చ. సరసము లైనగ్రంథములసార మెఱుంగఁగ లేనికుంతలన్
సిరి గలవారిఁ జేసి, బుధసింహులఁ జేయఁ డు దైవ మే మొకో;
ముతిగెడు పేఁడలోఁ బొరలుపుర్వులతోఁకను వెల్గు దోఁచు; బం
ధురనుమగంధలోల మగుతుమ్మెదకుం గన రాదు; మిత్రుఁడా; 92

చ. పొదుపరు లైనవారు తముఁ బోషణ చేసికొనంగ నేర్తు రా
పదలను; దూబటీల్ పడెదుపాటులు మున్మను చెప్పి తీఱు నే;

యుదకము సేకరించుకొని యుష్ట్రి మెడారిఁ బిపాసఁ బాసెడున్;
మదకరి చల్లు లాడుకొని మ్రిందును గీ యని యార్చు; మిత్రుఁడా 93

చ. తనధన మైన, దా ననుచితంపువ్యయంబును జేయు చుండినన్,
గని మహనీయు లోర్వ; రది కాదనిగట్టిగ మందలింతు; రె
ట్లన, మధురంబు లౌజలము లన్ని యుదోదధిపాలు, సేయఁ జా
చిననది కడ్డ మై మరలఁ జేయ రె చేలకుఁ గట్టఁ మిత్రుఁడా.

ఉ. దాతలు భోక్తలుం బరమధన్యులు; సర్వము నస్థిరం బె యీ
భూతలమందు; నేది యెటు పోవు నొ కానఁగ నేర రెవ్వరున్;
దాఁతురు మేలికప్పురపుదంపలు పెట్టెలఁ; గొన్ని నాళ్ళకుం
జూతురు వానిదారము లె; చోద్య మె యర్థముపోక! మిత్రుఁడా.

ఉ. క్లేశము, త్యాగభోగములు లేనిధనంబున నార్జనాదులన్;
లేశము గొప్ప వచ్చెదును లే; తుదిఁ దెచ్చెదుఁ బెన్వినాశమున్;
గాశితకుండలంబులను గర్ణము లాసను మోసిమోసి, యా
రా! శితకర్త్రిం దెగి ధరం బడుఁ దీర్ఘములందు; మిత్రుఁడా, 96

ఉ. విత్తము తాఁ గడించి పడ వేసిన నే మగు? నింటిలో నజా
గ్రత్త యయున్నచో, నడివ కౌవక లై నశియించి పోయెడుం
బొత్తిగ; నెట్లు నా, నడుగు వోయినకుండను మంచినీళ్ళు దా
నెత్తుక వచ్చి పోసినను నే మగు నో పరికింపు; సుమిత్రుఁడా.

చ. కలిగినవారి లేవడిని గాసిలువార లెకంద్రు; గాని లే
ముల దురపిల్లుమానసులమోము ను జూడరు పో ధనోన్మదుల్;
వెలుఁగున నున్నమానవుల వీక్షణ సేయుదు రంధకారమం
దలిజనుల్ లట్లు గాంచరు గదా మఱి వీరిని వారు? మిత్రుఁడా. 98

ఉ. సొ మ్మొకచోట నుండ నొకచో ననుమానము గల్గి, పేర్చుగ
ర్వమ్మున జెన్నిటుల్ నిరపరాధుల కె గ్గొనరించు చుంద్రు

కొమ్మలు దాఁచుకొన్నయెర కప్పున వే ఱొక పెంపకమ్రిందఁ దా
నిమ్మల నుండ, దాని కవి యీడ్వ వె వట్టివి పట్టి? మిత్రుఁడా. 99

చ. సమయము వచ్చినం దనవశమ్మున నున్నధనంబు, నోరికిన్
కౌమరకు వచ్చువిద్య యు నె నేరుచు నక్కఱ దీర్పఁ నమ్మ; కూ
పమునను గల్గునీళ్ళవలె వారిధరంబున నున్ననీరు లే
క్రిమమున మంచియక్కఱకు రాఁ గల వో పరికింపు; మిత్రుఁడా. 100

చ. ధనము గలంతమట్టునకుఁ ద న్నఖిలప్రజలున్ ముఖస్తుతుల్
ఘనముగఁ జేయుచుందు; రిది గాంచ వలెన్ ధనికుల్ వివేకులై;
మనుజులు డెంకదొక్కఱలకు మామిడిపండ్ల బిసుంగు చుండ్రె? తీ
యనిరస మంత పిండుకొని యావలఁ ద్రోవ రె వాని? మిత్రుఁడా.

చ. కనకమువల్లఁ గల్గెడుసుఖంబునకంటెను దుఃఖ మే ఘనం;
బనిశము మోద మొందు నరుఁ డక్కఱ కుండినఁ దృప్తి నొందినన్;
గనదురుచిత్రపింఛమునఁ గ్రాలుమయూరము లేమిసౌఖ్యముం
గనియెడు లాఁతిపుల్గుగమికన్నను, దుఃఖమె కాక? మిత్రుఁడా. 102

---

## దాతృత్వము.

చ. తమ కని దాఁచుకొన్నది వృథా ధన మింటను బూఁజు గట్టు? లో
కమునకు మేలు గోరి యిడఁ గా నది యోగ్యము శ్లాఘనీయ మౌ;
నమితము కంధి దాఁచుకొనునంబువు, నీలము క్షార మయ్యె; మే
ఘములకు నిచ్చినట్టిది, యకల్మషమున్ మధురంబు? మిత్రుఁడా. 103

ఉ. పాత్రమునందుఁ బడ్డ దనపాయశఁ గోటిగుణంబు వృద్ధి యౌ;
ధాత్రి నపాత్రమం దది మొదల్చెడి పోవును; నిశ్చయంబు; సు
క్షేత్రమునందుఁ జల్లినొకచేరెఁడువిత్తులు గోనెఁ డయ్యెడున్;
జిత్రమె? చౌటినేల నవి చేటును బొందుట లే దె; మిత్రుఁడా. 104

చ. అలఁతిగ నిచ్చినం, బరమహర్షము నొందదుఁ గాని పేద, తాఁ
గలిగిన దంత యిచ్చినను, గల్గినవాఁ డెపు డూఱడిల్లఁ;డే
యిల జలదంబు కొంతజల మిచ్చిన, సస్యము లుల్లసిల్లెడున్;
జలనిధి సర్వముం గొని యుఁ జాలక మ్రోఁగును గాదె! మిత్రుఁడా.

చ. మతి నెఱదాత లెప్పుడు ను మంచివి దాఁచుక చెడ్డ వొండ్లకుఁ
వితరణ మీఁ దలంపక వివేకమునం దగిన ట్లొనర్తు రాఁ;
బ్రతిధరణీజరాజము ను బక్వఫలంబులు గాయ లుండ, భూ
సతికిని బండు లిచ్చుట నిసర్గగుణం బగుఁ గాదె! మిత్రుఁడా. 1

చ. జను లసమర్థులైన నిజ, సత్కృతి నింపుగ నాదరించినన్,
మన మతిహర్ష మొందు, నది మాని యొసంగినఁ గాదు మోద; మె
ట్లన, నెలమావి నీడను విశాలపనంబున నేద దేఱ దే?
పునుకను దాడు పెద్దఫలముం బడ వేయ నదేల? మిత్రుఁడా. 107

చ. పదరక యర్థి కిచ్చెదరు పాడిమెయిం గలవాఁడుఁ; లేనివోఁ,
గొదుకక బిడ్డ నే చెదరఁ గొట్టుచు దూరక బాధ పెట్టినన్;
బొదుఁగునఁ బాలు గల్గ నిడుఁ బొందుగ నేరికి నైన; లేనిచో,
మొదవులు వానిదూడల నె మూతులుఁ వ్రీలఁ గఁ దన్ను; మిత్రుఁడా.

ఉ. తా నిడు టీయ కుంచు టయుఁ దక్షిణ మే సుజనుండు దెల్పెడిక్;
హీనుడు త్రిప్పిత్రిప్పి విసిగించి తృణమ్ము నొసంగ కంపెడున్;
గానమెకాల వేసఁగిని గ్రుక్కెన నిచ్చి రొయి యీ కొ పంపు రాఁ
గానె మండుం; గొడారి యటు గా; దడియాసలఁ బెట్టు; మిత్రుఁడా.

ఉ. ఇయ్యకు మంచుఁ జెప్పినను, హీనుఁ డొసంగక మానఁ; గాని తా
నియ్యక పోఁడు దాత, యొవ రెన్ని విధంబుల నడ్డగించినన్;
గయ్యా, కళింగ యడ్డ పడఁ గట్టు వడుం, బొల మెంపఁ బాటినం;
బయ్యోర గొంటు చుండినను, బండగు నే జలదంబు! మిత్రుఁడా.

## ఋణము.

చ. అవసర మెంతవారలకు నైనను వచ్చును; గాన మంచిమా
నవుఁడని తోఁచె నేని యొక ఋణ మొసఁగన్ వలె శంకఁ దక్కి; స
త్తువ మెయి నెల్లయోషధితతుల్ మొలపించున దయ్యె, గుల్లయై
యవని యపేక్ష సేయు నెరువర్షమె యీయక పోవ? మిత్రుఁడా.

చ. అడుగక యున్న నున్న యగు న; ప్పటు గావున మంచిమాటలన్
గడువునఁ దప్పకుండ నడుగన్ వలెఁ జుమ్ము ఋణ;మ్మదెట్లనన్,
పొదుఁగుల రేపుమాప రసి దోహనముం బొనరింప కుండినన్,
జెడి యొక కొన్నివారములఁ జేఁపు నశించును గాదె; మిత్రుఁడా.

చ. పగ తెగు లప్పు తప్పు నివి ప్రాప్తము లైనను, వేగ నేమి యున్
మిగులక యుండఁ దీర్పుట యె మే; లటు సేయనిచో నపాయ మౌ;
రగిలెడునగ్నిహోత్రమును రాజక యుండఁగ నీటిధారలన్
దగ మొదలంట నార్పమిఁ బదంపడి యే మగు నయ్య' మిత్రుఁడా.

ఉ. అప్పులు తాము పుచ్చుకొనినట్టులె క్రమ్మఱ నీయఁగా వలెన్?
దప్పిన వీడు నాకొక్క ఋణదాత, గొనుం గద కర్కశంబునన్?
దిప్పలు నీకు లన్ని తెకతేరఁగఁ బిల్చి, మొఱంగఁ జూడఁ గా
కొప్పరికించు నే ఖరమయూఖుఁడు గైకొన కుండెఁ? మిత్రుఁడా.

చ. ఇతరులసొమ్ము లోభి హరియించి యొసంగనివాఁ డదెత్తి స
మ్మతిఁ దిరుగంగ నీ కిడినమానిసి కుత్తుక కచ్చు వోసి యు
ద్ధతిఁ గొనుఁ జుమ్ము; యూధమున దాఁచినపాలను గోలువత్తిలం
బిడుకఁడె దోగ్ధ కుద్ధుఁడయి పెన్మెడకొంకులు గట్టి! మిత్రుఁడా.

ఉ. వడ్డికి నాస పుట్టి చెడువానికి విత్తము నప్పు వెట్టినన్,
వడ్డికిఁ జేటె కా కసలువట్టము గూడను సంభవించెడున్;
గడ్డియుఁ జొప్ప యుం జనఁ బశాళుఁడలుఁ దౌడును జిట్టుఁ బొట్టుఁ దా
రిడ్డను గొడ్డుటావునకు నేమగు నో పరికింపు; మిత్రుఁడా.

## లోభిత్వము.

చ. అనద నటంచు నొక్కఁ డలచె నా, నిజుపేదకు నున్న యంతలో
వనఘుఁడు వెట్ట కుండఁ; డకటా కలుషాత్ముఁడు లోభి వెట్టునే?
కనుఁగవ తెప్పలం దెఱచి కన్గొన, వెల్తురు దాఁచుకోదు గా,
తనకడ నున్నవస్తువులఁ; దాఁ దిమిరంబు ను బోలెఁ! మిత్రుఁడా. 117
ఉ. ప్రాణముకంటెఁ దీ పనుచుఁ బామరుఁ డర్థముకై పెనంగుచుం,
బ్రాణము నర్థము న్విడుచుఁ; బ్రాజ్ఞుఁడు తద్విపరీతచర్యుఁ; ద
క్షిణమధుద్రవం బిడక జీవము లిచ్చును ముందు దంశక
శ్రేణి; పెరన్ ధరాజము త్యజించి గడింప దె వెండి? మిత్రుఁడా. 118
ఉ. ఆకలితో గడించి కడు పార భుజింపక దాఁచి, లుబ్ధకుల్
మిక్కిలి దుఃఖ మొందెదరు మీఁదను; భోగు లె మోదభాగులౌ;
మక్కువఁ దావ లేక మధుమక్షిక తేనెను బుట్టఁ గూర్చి తా
నుగ్గుగ తెలుంగు గ్రుక్కఁగొనఁ; జూడు మరిప్రకరంబు; మిత్రుఁడా.
చ. విను కఠినుల్ మృదూక్తులను వేఁడెదునర్థుల కీక, తారు నుం
దినక ధనంబు దాఁచినను, దెక్కలి కొం అది దక్క నిత్తు రే?
చనవునఁ బలుకచిలుకల కొసంగి మెసంగక, నారికేళముల్
పెనుచును లోనఁ గొబ్బెరను; బేరుఱుతల్ దిన కున్నె? మిత్రుఁడా.
ఉ. తా నొక కాసు గవ్వప్పుడు దానము సేయఁ డొసంగువారికిం
బూనిక నడ్డ మౌఁ, దనదుపుట్టిమునింగినయట్టు లోభి; యౌఁ;
గానల ముండ్లతుప్ప లొకకాలమునందు ఫలింప కుండి యున్
మానుగఁ బండు లిచ్చుపలుమ్రాఁకుల కడ్డము రావె? మిత్రుఁడా. 121
చ. పరిజలకుం బంచి పెట్టుటకు దవ్యము దాత యొసంగ, లోభి వే
రజ మది తాన మ్రింగును దురాశ; మహోన్నతుఁ డట్లు సేయు నే

నుజలము మేఘముల్ వలయుచోట్లకుఁ బంపుట కీయ, సైకత
వ్రజముహరించుఁ; గాని కుధర్మ్యము హరించు నటయ్యా? మిత్రుఁడా.
చ. ఆవసర మావ్యయంబునకు నైనను ప్రాణము లొప్ప కున్నమా
నవునకు లాభ మబ్బ; దతినష్టము తప్పక వచ్చు నమ్మమీ;
తవిలినయాసతో మన మెత్రావఁ గ వచ్చును సర్వ మంచుఁ గ్రో
పు విడువ కున్న, నా పెటులు ముందుగఁ జేఁపెడునయ్యా? మిత్రుఁడా.

## ్రయము.

చ. ఘనులను నాశ్రయించినను గష్టము లన్నియు గట్టె యెక్కు; హా!
దినదినగండ మల్పులను దీనత మానవు లాశ్రయించినన్;
వననిధిలోనిమత్స్యములు వర్ధిలు చుండవె నిర్భయంబు గా?
జైన వెలుపడ్డ దాదిగ నశింప వె గుంటలమీలు? మిత్రుఁడా. 124
చ. అనయము సౌఖ్య పెట్టుఁ దనయాశ్రితులకు ఘనుఁ డైన, నీచుఁ డో,
తన కడ సంతటంచును మదంబున వారల నేఁచఁ బూను; నె
ట్లన, హిమఘర్మవర్షసమయంబులు మూఁడిటఁ బాంథులన్ వటం
బనువుగఁ బ్రోచుఁ; దుమ్మదతియంజనఁ గొట్టులుగొట్టు; మిత్రుఁడా,
ఉ. కొంచెము కాలుసేతులను గూడఁగఁ దీసికొనంగ శక్తి గా
న్పించినదాఁకఁ గా కవుల నీచునకున్ ఘనుఁ డెట్లు లోఁబడున్?
గాంచఁ గ గుల్లలోనఁ గలకాల మడంగు నె పిల్ల? సాంగ మై
చంచున దానిఁ జక్కడఁడి చయ్యన వెల్వల రాదె? మిత్రుఁడా 126
ఉ. ధారుణిఁ బూజ్య లౌజనులు దక్కువవారిని నాశ్రయించినన్,
గౌరవహాని లేదు; తమ కార్యముఁ గక్కతిలిం దటస్థ మా;
సారతరంబు లైనయలసానలఁ దీతినజాతిరత్నముల్,
దారము నాశ్రయింప, వెల తగ్గ నె యించుక రైన? మిత్రుఁడా.

చ. తనకడ నున్న సేవకులదార్ఢ్య మెఱుంగఁగ లేక, యందఱం
బనిగొను నొక్కతీరున నె పాపపునీచు వివేకహీనతన్;
గనుఁగొనఁ జాకివానికడ గాడిద గుఱ్ఱముఁ గూడ నుండినన్,
గొన మెఱుఁగండు; రెంటిపయి గుడ్డలమూట లె వేయు; మిత్రుఁడా.

చ. మనుజుఁడు క్రిందివారిఁ జనుమాన మొనర్చక యాశ్రయింప కుం
డినఁ బయివారిమన్నన గడింపఁగ లేఁ డతఁ డెట్టిఁ డయ్యు; నె
ట్లన, నల విడ్డకంపలను నల్లికబిల్లికఁ జుట్టుకొంచు నొ
ప్పనియెడఁ బాదులో మొలక పందిరి యెక్కు నటయ్య? మిత్రుఁడా.

ఉ. సమ్ముఖవర్తి జేని కని చాల నశక్తుని నాశ్రయింప వ్య
ర్థ మ్మగు; దౌల నుండినను దక్షుఁ గన న్వలె; మేఁకయుత్తమాం
గమ్ము సమీపమందుఁ గలకంఠకుచమ్ములఁ బట్టి వ్రేలినం,
గుమ్మలు నిచ్చు నయ్య, పొదుఁగుంజను లిచ్చును గాక? మిత్రుఁడా.

చ. చెడి పరభాగ్యజీవనము సేయు ఘనుం డర సచ్చి; నీ చదే
కడు సుఖగౌరవావహము గా నెపు డెంచుక పొంగు సిగ్గు లే;
కడవికిఁ బాసి వచ్చి కృశమై యుపలాలన సేయఁ జేయఁ గాఁ,
గడి గడె కెత్తు హస్తి; శునకం బదె చూచుక పొంగు; మిత్రుఁడా

చ. ఒకళులపెట్టువోఁతలకు నొగ్గుట దోసిలి పౌరుషంబె, ర
క్షకుఁ డిడఁ గాలునేతు? లతిగర్వ్యము యాచన మానవాళికిన్;
బ్రికటము, పాలుమాలక పరిభ్రాతమునం బెనుబారులై పిపీ
లికలు ను నూకగింజల గడించుట లేదె స్వశక్తి? మిత్రుఁడా. 132

— —

## రాజు.

ఉ. రాజొకఁ డుంట కుండినను, రాష్ట్రమునందు ననేకదోషముల్
వే జనియించు; దానఁ బృథివీప్రజ కాపద సంభవించెడున్;
తేజము గల్గునట్టిహిమదీధితి లేనియమాసరాత్రిరన్,
భూజను లెన్ని యాపదలఁ బొందెదరో పరికింపు; మిత్రుఁడా. 133

ఉ. రా జెటువంటివాఁ డతనిరాష్ట్రము నట్టిద యౌను; గావునన్
రా జగువాఁడు సర్వగుణరమ్యుఁడు గావలె ధర్మవృద్ధికిన్;
దేజిలుచున్న నాత్మ కడఁతిన్నని దాఁచును, నింద్రియంబు లే
యోజను బాపకార్యముల నూరక చేసెడు నయ్యా? మిత్రుఁడా. 134

చ. సరసులు చాలఁ జేరుదురు సద్గుణముల్ గలవానియొద్ద; న
క్కరణి న దుష్టునొద్దఁ బలుగాకులు సేరుదు; రెట్టు లన్నచోఁ,
బరభృతకీరశారికలు బంధురముల్ దఱు చుండు నందనో
త్కరముల; నెల్లకాళ్ళకడఁ గాకులు గద్దలు గావె? మిత్రుఁడా,

చ. నరులను నేలువాఁడు కరుణారసపూరితుఁడుం బ్రతాపసం
భరితుఁడు నౌచు నుండవలె; భాసిలఁ డం దొకదాన నెన్నఁడున్!
కరము మధుద్రవంబు సరఘాతతి గూడను నుంటచేఁ గదా
పెరుఁగును దేనెపట్టునెడఁ బ్రీతియు, భీతియుఁ గూడ; మిత్రుఁడా.

చ. విసర వోనిబీరమున వెగ్గెడు రేనికి జంకుఁ; గాని పై
వేసము వేసికొన్నపృథివీభుజునిం బ్రజ లక్ష్య పెట్టు నే?
రోసము గల్గుత్రాఁచును నరుల్ గనుఁగొన్న భయంబుఁ బొంద రే?
కూస మలక్ష్య పెట్టుచును గ్రిమ్మఱు చుందురు గాని? మిత్రుఁడా.

చ. అరి యనుచుం బ్రతాపమున నందఱియొద్దను బుచ్చుకొన్నసొ
మ్మరసి జనోపయోగమునకై వ్యయపెట్టుట నీతి భర్త; భా
స్కరుఁడు సహస్రధా భువిరసంబు గ్రహించి, వహింపఁ జూచు నే?
వరుసను వాన లిచ్చి సదుపాయముఁ జేయును గాని? మిత్రుఁడా.

ఉ. విక్రమశాలి యయ్యుఁ బృథివిం బతి యేలఁగ లేఁడు రాజ్యతం
త్రక్రమవేది మంత్రి వినాగ; న దిర్వ్యరు పూనఁగా వలెం;
జక్రము నిల్పఁగా నిరుసు చాలు నె యొక్కఁడు నుక్కు దయ్యుఁ; న
త్ప్రక్రియ కొక్కకీలకము పార్శ్వమున న్నిల కున్న ? మిత్రుఁడా.

ఉ. కొట్టుచుఁ దిట్టు చెల్లపుడుఁ గ్రూరత నూళ్ళట వట్టిపిచ్చి; తే
డి ట్టటు కంటఁ బంట బెదరించుచు సామ్యత నేల మేలు ను;
మ్మెట్టులు పృథ్వి దాఁ బరిమళించుఁ బ్రచండమరీచి తేజునన్;
గ ట్టిగ వెట్ట గా నగును గాక; ఘనం బెటు సేయు ? మిత్రుఁడా.

చ. సరసుఁడు నెమ్మి వాంఛిత మొసంగెడు సత్పథవర్తి యయ్యు, ని
ద్ధరఁ బ్రభు వాది నైజము ప్రతాపము నూపుట; వెన్క శాంతుఁడౌఁ;
గరము ను దొల్త గర్జిలుచుఁ గారణ మౌఁ గదఁ యొక్కకున్ ఘనుం;
డురుజలధారలం బిదప నొప్పచుఁ జల్లన గాఁడె? మిత్రుఁడా. 141

చ. పరిజలకుఁ గల్గుబాధ తనబాధ గ నెంచి నివారణంబు చే
గ జరప కున్న తేఁ, డది య కారణ మయ్యెను నాత్మహానికిన్;
నిజము, దురామయంబుల మునింగిన మేనికి సత్వరం బ చే
హిం జగతి వైద్య మీయక, యుపేక్ష యొనర్చిన షేం లె ? మిత్రుఁడా.

ఉ. పాడికి నెల్లవారలు ను బద్ధులు గా వలెఁ; గా కహంకృతిన్
గీ డొనరింపఁ జూచినను గెల్చు నె బల్లిదు దుర్బలుం డిలన్ ?
గూఁడులు పన్ని పిచ్చుకలు గ్రుడ్డులు పెట్టుక యుండ, నక్కటా!
గోడుపడం గ జోడుపులుఁగుల్, భుజగం బవి మ్రింగు; మిత్రుఁడా.

చ. జనపతి న్యాయదండనము సల్పక మిక్కిలి క్రౌర్య మూనినన్,
జను లతిసాధు లయ్యుఁ దమశౌర్యము నూపక యాజ్ఞ నిల్తు రే?
యనలము సన్న పుస్నెకల న ట్టిటు గాఁపక పెద్దవేఁడి చూ
పినను, బయున్న పైఁ బడక భీతిలి యుండు నె కుండ? మిత్రుఁడా.

ఉ. ఎల్లరజీవితంబులను నెక్కటి గావఁ గఁ బూనుకొన్నభూ
వల్లభుమానసంబునను స్వస్థత యెన్నఁటి కైనఁ గల్గునే?
చల్లన యౌచు వేఁడగుచు సత్వర మౌచును మంద మౌచు, ని
ల్లెల్లపుడు న్మరుత్తు చలియించుచు నుండును గాదె? మిత్రుఁడా.

చ. జనపతియాజ్ఞ యత్యధికచండ మగున్ భటునుండి వచ్చినన్;
గనుఁగొన నంతతీక్ష్ణ మది గాదు సుమీ పతినుండి వచ్చినన్;
విను, రవిరశ్మి బింబమున వెల్వడి వేఁడిగ మాత్ర ముండు; న
య్యినమణినుండి వచ్చిన, దహింప దె దేనిని నైన? మిత్రుఁడా.

చ. నరపతి దా సమర్థుఁడయినం దనవాని నలంతి నేని యున్
బరునకుఁ జిక్క నిచ్చిన నపాయము వచ్చుట నిశ్చయంబు; బం
గరు రజతంబు రత్నములు గల్గి, దృఢం బగుభూధరంబు లు
ప్పరి గునపంబు పట్టుకొని వచ్చిన నేమగు నయ్య? మిత్రుఁడా.

చ. తమ కధికారి యౌనతనిదార్ఢ్యము తన్ముఖపర్శ్వనాదికృ
త్యముల నెఱింగి భృత్యజన మాతనికిం దగినట్లు లుండు; న
శ్వము తనపైని స్వారి సలుపం జనుదెంచినరౌతుకౌశలిన్
నిముసములో గ్రహించి, చను నేతవినీతినిబట్టి; మిత్రుఁడా. 148

చ. బెడిదము లౌచు చుండినను బెట్టైడు నేలికఁ గూర్మి సేవకుల్
విడువరు; పెట్ట కున్నతఱి వీడుదు రేమి యు నాడ కుండినన్;
బిడుగులు రాల్చిన న్విడిచి పెట్టవు చాతకముల్ ఘనాఘనం;
బెడఁదల నిచ్చగించు నె భజింప శరచ్ఛరదంబు? మిత్రుఁడా.

చ. కొలఁదియె గొప్ప యో తమకుఁ గూడను మేలగు నన్నకార్యముల్
వలె నిల వట్టివెట్టిపనులం బొనరింపరు సుమ్మి యెవ్వరున్;
నిలయమువంక కన్న గమనించును వార్వము వాయువేగ మై,
యలసట నొందియున్; బయన మన్న గమించు నె యట్లు? మిత్రుఁడా.

చ. సులభముగా లభించు నని చులకనవానిని సంగ్రహించినం,
గలుగును బెక్కునష్టములు; కైకొనఁగా వలె మంచివానినే;
తలుకుచు నోలి తక్కు వని గుడ్డిపడంతుకఁ బెండ్లి యాడినన్,
నెల కొకకుమ్మరావ మవనిం బగిలింపక యున్నె; మిత్రుఁడా.

ఉ. లోలత నాధిపత్య మొకలుబ్ధున కిచ్చిన, హెచ్చు సేయఁగాఁ
జాలఁడు; గాని పీలయిన, శక్తి కొలందిని మాపు రాష్ట్రమున్;
మేలు గఁ గాచి పెంపఁ దగుమేఁకలమందలమీఁద వేఁడు తో
డేలికిఁ బెత్తనం బిడ, వశిం దిగ మ్రింగక యున్నె? మిత్రుఁడా.

చ. పుడమి మహాత్ము లుండఁ దగుపూజ్యపదంబున నీచు నిల్పినం,
గడుఁ బరిహాసపాత్రుఁ డగుఁ; గాని యొనర్పఁగలండె తత్క్రియల్?
చిలుకలు గోరువంకలు వసింపఁగఁ గట్టినపంజరంబులో
నిడినను గాకము, న్నగుదు రీతియ కా కటు పల్కు? మిత్రుఁడా.

చ. ధరఁ బ్రతిభాఢ్యు నుత్తమపదంబున నుంపక నీచవుం బదాం
తరమునఁ ద్రోసినం బ్రభు వనామకుఁ డై యతఁ డుండ నేర్చునే?
వెరవునఁ బాదునం దునిచి పెంపఁ గఁ జాలినవిత్తు, వెంటపై
నరయక పాఱ వైచిన, న దక్కుఁడఁ గప్పుడి యున్నె? మిత్రుఁడా.

చ. ఘనుఁ డితఁ డల్పుఁ డీతఁ డను జ్ఞానము లే కధికారి నంచు నొ
ప్పనివిపరీతపుంబనుల వారికిఁ జెప్పుట గొప్పతప్పగున్;
జనుఁ డపసవ్యసవ్యకరసంస్కృతి లేక విపర్యయంబు గాఁ
బనులిడు వానిఁ జొప్ప, నగుఁ బాట్లగచాట్లగుఁ గాదె? మిత్రుఁడా

ఉ. చిల్లరవారి నెట్లయినఁ జేయఁగ వచ్చును నొప్పి దోఁచినన్;
జెల్లదు వారలం బలెను జేయఁగ ముఖ్యుల నారయ న్వలెన్;
గోళ్ళను తీసి వేసినను గోరమె భారము గానిపించినన్?
వ్రేళ్ళను గొట్లు చేయుటకు వీ ళ్ళగుఁగ న్వలెఁ గాని; మిత్రుఁడా.

చ. కర మనుకూలవృత్తిఁ దమకష్టసుఖంబుల కాజనంబులన్
భర మని వీడిన న్వలయుపట్టున రా; రపు డేమి సేయ నాఁ;
దరువున వాన రా నెటు లొ తేర కుపానహముల్ దొలంగినన్,
దరువరి ముండ్లు గండ్లు గలతెన్నున నేమగు నయ్య? మిత్రుఁడా.
ఉ. ఎండకు వాన కోర్చుహితభృత్యుల నేమఱ కుండఁ గావలెం;
బండితులుం బ్రధానులు ను బంధుపురోహితు లెంద ఱుండినన్;
దండిగఁ బచ్చకప్పురము తావిహిమాంబులు కజ్జలంబు పూ
లుండిన నేమగు, న్నయనయుగ్మము లెప్పలఁ బాయ? మిత్రుఁడా.
ఉ. ప్రోవనొ ద్రోవనో మఱి యు భూవరుఁ డేమి యొనర్ప నెంచెనో
యేవిధి నైన ముం దొకని కే లెఱిఁగింప? ఫలంబు దెల్పదే?
దైవము మే లొ కీడొ మఱి దానిక నేమెయి నేమి సేయునో
జీవుల కాఫలోదయము చెప్పుట లేదుగ దయ్య? మిత్రుఁడా. 159
చ. పగతురు మాసి రంచును నృపాలుఁడు మత్తత నుండ రాదుగా?
జగతిని నేని కంతజయశాలికి నైనను శత్రు వుండెడున్;
మొగ మొగి జేవుఱింపఁగను బూర్వగిరిం దిననాథుఁ డెక్కి క్రిం
దగునిరు లుక్క డంప, నది యవ్వల నే చుట లేదె మిత్రుఁడా. 160
ఉ. జితుఁ డగు దక్షుఁడుం గొలఁదిచేతఁ బరాజ్మతి యైన, జాగరూ
కత పడి వెన్క ముం దరయఁ గల్గినవాఁ డసదైవ నోడు నే;
ధృతి సెడి దద్దఱిల్లు నతిధీరుఁడు. బాలుఁడు వెన్కఁ గ్రో యనన్,
మతి మఱపున్న; లేమిని గుమారుఁడు జంకఁడు గాదె? మిత్రుఁడా.

## నియంత.

ఉ. మగఁటిమి గల్గువారు పలుమానును లుండిన నేమి? వారిపైఁ
దగు మొనగాఁడు లేక బలదర్పము నూపఁగ నేర; రట్టులే
యగుఁ గద? తర్జనీప్రభృతు లౌనితరాంగుళు లెన్ని యున్న, లె
స్సగ బొటనవ్రే ల్దొలంగి పని సల్ప సమర్థము లౌనె? మిత్రుఁడా. 162

ఉ. స్థైర్యము ధైర్యముం గడు పరితాపము గల్గి ప్రభుండు నిల్పినం,
గార్యము నెట్టిదైన నొడికంబుగఁ దద్భటు లాచరింప రే?
యర్యమునంతవాఁ డొకరుఁ డట్లు వెలుంగుటఁ జేసి, మింట దు
ర్వార్యము లై గ్రహంబులు నిరంతరముం దిరుగాడు; మిత్రుఁడా. 163

చ. నడిపెడునొక్కఁడంటకతనన్ జతనంబు ఫలించు టెట్లు లో,
చెడుట యు నట్టులే పిటికిచేరికఁ దత్కృషి; వాని నుంతు రే?
వడివడి వాయుయంత్రమున వచ్చును నీ రొకచక్రశక్తిచే;
నడుగడె క్రింద గొట్టమున నొక్కఁడఁ జిల్లియ యున్న; మిత్రుఁడా.

ఉ. సాహసమున్ సమర్థతయు సక్తత గల్గిన నేమి? తగ్గప్రో
త్సాహము లేమిఁ జిన్నపని సైత మొనర్పఁగ లేక వ్యర్థుఁ డౌ;
లోహములం గరంచు ననలుం డొక డూఁదిన; నూఁద కున్నచో,
దాహము సేయ లేఁడు పోయిఁ దాపినకట్టెల నైన; మిత్రుఁడా. 165

ఉ. ధీరుఁడు ముందు మార్గమును దీసినపిమ్మట గాలిఁ దూలుని
ష్పౌరుషుఁడుం గడంగు; సులభం బగుఁ జేసినవెనక నెద్ది యున్;
హీరశలాక రత్నమున కేర్పడ రంధ్ర మొనర్ప, దానిలో
దార మె దూఱఁ జాలుఁ; ద్రోలుతం దరిఁ జేరదు గాని; మిత్రుఁడా.

## సేవకుఁడు.

ఉ. మంచిమనస్సు గల్గుయజమానునియొద్దనె గాని, క్రూరపుం
జంచలబుద్ధి గల్గుప్రభుసన్నిధి సేవ యొనర్ప రాదు; ఘ
టించినవిద్ధపుష్కసరణి నేగును వేగ సురక్షితంబు గాఁ
గంచర; మెవ్విధి న్విషమకాననమందుఁ గమించు ? మిత్రుఁడా. 167

చ. మనుజులు వ్యర్థ మౌదురభిమానము మానొకని తారు నేరునా
తని కనువర్తులైన, సుపథం బయి బంధులతో సుఖింతు; రె

ట్లన, నిజదైర్ఘ్య మెంచుకొని యామునఁ ద్రుళ్ళక, సూచికానువ
ర్తనమున దారముల్ పటముతంతులతో సుఖ ముండు; మిత్రుఁడా.

చ. తెలిసి విధాయకక్రియలు తిన్నగఁ జేసిన సేవకుండు మా
టలు పడ కుండుఁ; గాని యకటా వికటంబుగ నున్నఁ జే టగున్;
సులువుగ నాగవాసమునఁ జొచ్చినదో, గడె కట్టిబన్నముల్
గలుగవు; బెట్టు సూపిన శిలం బిగఁ గొట్టక యుండ్రె? మిత్రుఁడా.

చ. సుజనులు చేరి యేలికకు శోభ ఘటింతురు; తాము మందు; ర
క్కుజనులు రెండుపక్షములకుం బ్రళయావహు లౌదు; రింత యున్
నిజము; మరంద మాను చవలీజము రాజిలఁ జేయు షట్పద
వ్రజములు; ప్రుర్వు లాత్మ తరుబాధకకృత్యము లౌను; మిత్రుఁడా.

ఉ. సేవకు డెప్పుడుం దమకు జీవన మిచ్చెడు ఱేఁ డొకపట్టు దాఁ
దీవర పడ్డఁ, దాము నటు తీవ్రత సూపక, నమ్రు లౌట మే;
లేవిధి నన్నఁ, దొల్కరిని నేలు భయంకరనాద మాచు రాఁ,
గ్రీవల నీటిప్రబ్బలులు క్రిందికి వంగుట లేద? మిత్రుఁడా. 171

చ. జగతిని నెందులోఁ దనకు శక్తివిశేషమొ దానిఁ బూన మేల్;
తగుదు నటంచు నన్నిటికిఁ దా జడి సిద్ధపడం బ్రశస్త మే?
ఖగసముదాయముల్ తమకుఁ గాళులునుం గల వంచు నిక్కుచున్,
మృగములవృత్తిఁ బూని చరియించిన లగ్గగు నయ్య? మిత్రుఁడా. 172

ఉ. ఏలిక, చిత్త మెట్లు ప్రసరించిన నట్ల వచించు; లెంకకున్
మేలు తదానుకూల్య మ నుమీ; విపరీతము నీతి గాదు; వా
తూలవశంబు లంబుదముతోరపుధారలు; మాఱు నూఱుచం
దాలను; ఛత్రి మధ్వగుఁడు దాల్పవలెం దగినట్లు; మిత్రుఁడా. 173

ఉ. ఏన మహాంతరంగికుఁడ నేలిక కంచును బొంగ రాదు; త
న్నాత్మని ప్రధానుఁ జేయు యజమానుఁడు కొండొకవేళ నన్యునిన్;

భూసుతకీర్తి భూరితరభూతియుఁ గాంచినధూమసామ్ముఖ
స్థానపురంబు లంబుధికి దవ్వయి పల్లెలు గావె? మిత్రుఁడా. 174

ఉ. ధారుణినాథునొద్దను బ్రధానుఁడు కావుటఁ బూసషుండు వి
స్తారవిభూతి నొందినను, దప్పక మృత్యుముఖస్థకల్పుఁడే;
వారిధియోర ముఖ్యతరభావము నొందుటఁ, బట్టణంబు చే
పారముపృద్ధి గాంచినను, నాపద కగ్గము గాదె? మిత్రుఁడా. 175

ఉ. మంతిరి యైనవాఁడు యజమానునిఁ, గాపథమందుఁ బోనియ
ట్లంతయు సర్వలోడ మరలించి, సుఖించును దాను భూజనం;
బంతము లేనిసాగరమునం దల యుర్మ్యల యూఁచునావ ద్వీ
పాంతర మెయ్యఁ జేర్చి ముద మందఁడె మాలిమికాఁడు! మిత్రుఁడా.

చ. ఒడయనిపాలఁ బాలసుఁడె యుండినచోఁ, దనవాని నైన న
క్కడ మతి చేర నీయఁ డనఁ గా, నఁక నన్యులమాట యేటికిన్?
గడపకిడం బరుండి శునకంబు నె చేరఁగ నీదు కుక్క; యొ
వ్వడువున నింక నర్థులను వాకిటఁ గా లిడ నిచ్చు? మిత్రుఁడా. 177

ఉ. ఉర్విని లంచగొండితన ముండినవాని మనంబు శుద్ధమే?
యుర్వర కెత్తుహస్తముల సెయ్యది నిండిన మ్రొగ్గు నద్దెసన్;
బర్వెడుమ్రానుముల్లు, తనపార్శ్వపుఁజిప్పల దేన సుంతురో
బ ర్వధికంబు, దానిదెస బాగుగ వ్రాలుట లేదె? మిత్రుఁడా. 178

ఉ. ధర్మ మధర్మ మేమిటికి ధారుణి లంచము వట్టుమొండికిన్?
చేర్మిని వాని కింత పడ వేసిన, సెంతకు కైనఁ బాల్పడున్;
గూర్మిని దన్నుఁ బెంచుదొరకొంపను దోఁచఁగ వచ్చుదొంగవాఁ
డర్మిలిఁ బెట్ట నింత పెసఁగన్నము, కుక్క పరుండు; మిత్రుఁడా.

చ. ఒడయనిపాల సెంతచన వుండిన, నీచ మహాత్ముకన్న సె
క్కు డగునె? వాఁడు గర్వ పడఁ గూడదు వారలయొద్దఁ; బిల్లి యొ

ప్పుడు నవరోధసౌధమునఁ జొంను గ నుండినయంతమాత్ర నె
వ్వఁడుపున నెక్కుడౌను బురబాహ్యగజేంద్రముకంటె? మిత్రుఁడా.

---

## వివిధాంశములు.

చ. పుడమిని గొప్పవస్తువులపోకడయంను రాకయందు సం
దడి పొడము న్నిరంతరము; తక్కినవారల లెక్కయేమి? న
ల్లడల శకుంతముల్ చెలఁగుఁ గా, రవియస్తమయోదయంబులన్!
మిడుఁగుఱుఁబుర్వు లే మయిన మేదిని నెవ్వరి నేల? మిత్రుఁడా.

చ. అధములఁ జెప్ప నేల? యధమాధములుం దల యెత్తకుందు రే
యాధికులు లేనికాలమున? నందఱు పెద్దలె పెద్ద లేనిచో;
వ్యధికమనఃకుహూలానిళ నభమ్మునఁ జుక్కల కేమి? భూమిఁ బ
ల్విధములఁ బాఱుకాడునవి వెల్గవె కీటము లెన్నొ? మిత్రుఁడా. 182

ఉ. ఏమి సువస్తుసారము గ్రహింపఁగ నేరనిమొద్దె కద్ది తా
నేమి రుచించు? వాని దగునే యల నేరమి, దాత యుండఁ గాఁ?
ప్రేమను బుష్పమాల మెడఁ బెట్టిన గిబ్బనితప్పు పంది దే,
యామహనీయకార్యమున కైనసుబుద్ధి గాక? మిత్రుఁడా. 183

చ. వెలయఁ బరిశ్రమ న్విపులవిద్యను నేర్చుచుపోత్కుకన్నఁ దా
వెలుఁగును గొన్నిబూటకపువిద్దెల నేర్చిననీచుఁ డే మహా
వలయమునందు; శుభ్రతరవస్త్రముకన్నను, జూచువారిక
న్నులకును రంగుగుడ్డలు వినోదము సేయును గాదె? మిత్రుఁడా. 184

చ. చనుచలిచీమ నేనియును జావఁగఁ ద్రొక్కుట యెట్టినో యెఱుం
గనియతిశీతలుం డయినఁ, గాఁ గలఁ డే హితుఁ డెల్లవారి? క
ట్లనఁ, దనరాక చేఁ గువలయంబును రంజిలఁ జేయుచందురుం
డనయము గర్భశత్రుఁడు గదా నలినంబుల కెన్న? మిత్రుఁడా. 185

చ. మితముగ వాతెఱం దెఱచి మెల్లనగున్ రతనాలనవ్వు యో
గ్యతముఁ; దయోగ్యుఁడో సెలవివాఱఁగ బిగ్గర నవ్వు; నెట్లనన్,
గుతుకముఁ జెంది స్వాతిచినుకుల్ పడ మోమర విచ్చు శుక్తి; దా
నతివివృతాస్యమై తెలుపు హర్షము గోఁదురుఁగప్ప; మిత్రుఁడా. 186

ఉ. పిన్నటనాఁటనుండి కని పెట్టుక యుండినవార లుండఁగా,
మన్ననఁ బొందు చంద్రుడు నడుమం జనుదెంచినయట్టివారి; యె
ట్లన్నను, గర్ణయుగ్మమును నాలఁ బిఱిందికిఁ ద్రోచి శృంగముల్
పన్నుగ నెత్తిమీఁదివయి బంగరుసొమ్ములఁ దాల్చు; మిత్రుఁడా.

చ. చపలులమాట నమ్మి యొకసాహసకార్యము నాచరించినన్;
విపులవిపత్పరంపరల వేఁగుట తప్పదు సుమ్మి పిమ్మటన్;
గపటము గాదు; శారదఘనస్తనితంబుననచ్చికన్ దటా
కపుఁబరివాహముం దెఱవ గాసిలు వేసఁగివెట్ట; మిత్రుఁడా. 188

చ. నలుసును నల్పగాఁ దలఁప నాయమె? కొండలకైన మూలముల్
నలుసులె; కానఁ బ్రాజ్ఞుఁడు మనంబున దీని స్మరింపఁగా వలెన్;
నలుసును బోలువిత్తనమునం బెనుమఱ్ఱి జనింప లేదొకో?
నలుఁగడఁ గాఱుకొన్న వని నల్సున నీఱయి పోదొ? మిత్రుఁడా.

చ. తన కొకలోప ముండినను దాఁగుట గల్గును; గాని లేనిచోఁ
బని గల దయ్య దాఁగను, బ్రపంచమునందలి యేరికేనియున్?
జినుఁగు ను మాపు డాగుఁ గలచేలచెఱంగులు బైట వచ్చునే?
చనియెదుఁ గాక కుచ్చెళులసందుకుఁ, గచ్చలలోకి; మిత్రుఁడా. 190

చ. తనకడ నున్నలోపములు దాను గ్రహించుకొనంగ శక్తి లే
కనఘుల దూఱుటల్ సహజమౌను దురాత్ముల; కెట్టు లన్న లో,
చనములు గల్గునట్టి ప్రజతింతువు మెచ్చెడి లోకబాంధవున్
ఘనమునఁ గోటఁ డించుకయు మంచిగ నెంచు నటయ్య? మిత్రుఁడా.

చ. కలిగి యె యున్న మేలు; మఱి కల్గక యున్నను మేలె; గాని తాఁ
గలిగియు లేనియట్టి దగుకల్మి యనర్థకరంబె యెద్ది యున్;
దలఁపఁ గఁ బూర్ణిమానిశ యు దర్శనిశీథిని గాక, చంచలా
వలితపయోదమేదురవిభావరి పాంథున కెగ్గు? మిత్రుఁడా. 192

ఉ. ఎంత గడించుకొన్నఁ దమ కిల్లొకచోటను లేక పోయినన్,
సుంతయు మేలు గాదు సుమి; సొంతపులోఁగిలి యుంటయే సుఖం;
చింతయు నంత తేనె గడియించి గృహంబులఁ దేండ్లు దాఁప రాఁ,
బంతము పట్టి హైందవులు పంప రె యాలకు వాని? మిత్రుఁడా.

చ. కవన మనన్ విచారరచన; గావున నయ్యది చేతఁ గానివా
రెవరును లేరు; గాని రస మే యుదయించుట కష్ట మందులోఁ;
దవుదు మటంచుఁ బ్రొయ్యి పయి దా కిడి వండఁ గ నేర్తు రందఱున్;
బొవుపులు చక్కనంటి రుచి పుట్టునె యందఱిచేత? మిత్రుఁడా.

ఉ. తా రచియించుపద్యములఁ దక్కిన యొక్కవలుం బెఱింగి యుం,
గూరిమి యేమి యెక్కు? కవి కొంచెపువానినిఁ దీసి వేయ లేఁ;
డారయఁ గన్నకానుపున నందపువారలఁ బెంచి లాఁతులన్
బేరడఁగింప లేఁడు గద వేరమునన్ జనకుండు? మిత్రుఁడా. 195

ఉ. గుమ్మడికాయదొంగ యనఁ గొంకి బుజంబును జూచికొన్నలా
గిమ్మహి దోషి తానె యెఱిఁగించు స్వచేష్టలఁ దన్ను; బల్లులుం
గుమ్మరపుర్వులుం బలెను గ్రుమ్మరు నే పగలింట నింట స
ర్పమ్ములు వృశ్చికమ్ములు ను? రాత్రులు ద్రిమ్మరుఁ, గాని? మిత్రుఁడా.

చ. పరమదరిద్రుఁ, జేయ సులభంబు మహాధనవంతుఁ గా; మహ
త్తరధనవంతు నష్టము వదల్చుట కష్టతరంబు; వేసఁగిం
బురద యెండునట్టిచెఱువుం జలపూర్ణము సేయ వచ్చు; దు
ష్కర మగుఁ గా దె నిండునదిఁ గండిని గట్టఁగ వాన? మిత్రుఁడా.

ఉ. బాగొనరింప నేరికిఁ బ్రపంచమునన్ సులభంబు గాదు సు;
మ్మా గొనరింప నెంచునకు నొక్కనిమేషము పట్టదేరికే
లా గన, నాకుఁజిల్కఁగలులం బలురంగులు వేయఁ గష్ట మా
నూఁగును రాల్చి వేయుటకు నూఱుప్రయత్నము లేల? మిత్రుఁడా.

చ. అనిశము పడ్డపాటు వృథ యాశ్రితునందు నొకంత యేమఱన్;
ఘనునిమనంబు నిర్మలము; గ్రక్కున మాఱు నె యంతమాత్రచే?
నినుపవిత్రుచ్వ పట్టిచెను నెప్పుడుఁ దప్పక వాడ కుండినన్;
గనకపువాని కెల్లపుడు గావలె నే పులిగాపు? మిత్రుఁడా. 199

చ. అదివఱ కున్నయోరు పది యాక్షణమందున నెందుఁ బోవునో,
మదిఁ గడుఁ దత్తఱించెదరు మానవు లిష్టఫలంబు దగ్గఱన్;
బొదుఁగుల నీడ్చుకొంచు మొదవుల్ మునిమాపలసాలసంబు గాఁ
బదువును గూడి వచ్చి, తుదిఁ బర్వెడుఁ గా యిలు సూచి? మిత్రుఁడా.

చ. మదిని గలట్టిభావమును మాటలతోఁ దెలుపంగ నేటికిన్?
వదనముఁ జూచి యే తెలియ వచ్చుఁ బరేంగిత మెల్లవారు; నె
ట్లిది యనఁ, జందమామ యుదయింపఁగనున్నఁ, బ్రసన్నమయ్యెడుం
గద మునుమున్న దూరు; పట్టు గామిని నేగతి నుండు? మిత్రుఁడా.

చ. సమయము రాక మున్ను జనసంఘ మసంఖ్యమె; దాని నమ్మి కా
ర్యము దలపెట్ట రాదు; తుద కందొకకొందఱె నిల్చువారు; క
ళ్ళమున ను నూర్చురాశి సకలంబును గొల్లకు నమ్మనే? పలా
లము తుదిఁ దూఱు పెత్తినఁ బలాయన మైచనుఁ గాదె; మిత్రుఁడా.

ఉ. సారవిహీన మై బహుళసంకటల్ గలిగించు హేయసం
సారము పామరుల్ ప్రియతమంబు గ నెంచి చరింతు; రెట్లనన్,
ధారుణి మాంసశూన్యము ను దంతనిఘాతముఁ బూతిగంధ మా
తోరపు టెమ్మకం గని కుతూహల మొందదె వేపి? మిత్రుఁడా. 203

ఉ. ఎప్పుడు సూటిగా నడువ నెవ్వరు నేరరటంచు నెంచుటల్
తప్పగు; నేది యే మయినఁ దప్పదు రే పథమున్ మహాజనుల్ ?
తప్పక రాహుకేతువులు దారులు గాచిన, సూర్యచంద్రులా
చొప్పు దొలంగి వర్తిలరు చుక్కనిముబ్బులలాగు; మిత్రుఁడా. 204

ఉ. జ్ఞానికి మానసంబున వికారము గల్గదు సుమ్ము, తన్ను స
న్మానముఁ జేసె నేని యవమానముఁ జేసినయేని ; సీతువన్
దానము చేసి మ్రొక్కిన ముదంపడుమం, దనవైపు పెంజలిన్
హీనపువీఁపు ద్రిప్పఁ, గృశియించుచు నుండునె హేళి? మిత్రుఁడా.

చ. భువిపయి మంచివస్తువులు పొత్తిగఁ దక్కవు; యేమి పాప మో,
యవి యును దోషసంగతము లౌను నె గానఁగవచ్చు; నక్కటా !
యవనిజబృందమందు నను దోఁగద చందనపాదపంబు; ల
య్యవి భయదోరగోత్కరసమావృతిఁ గాంచఁగ నేల? మిత్రుఁడా.

చ. తనకును దప్పనట్టియొకదానికినై యవిధాయకంబు లౌ
పనుల యనేకముల్ సలుపఁ బొల్పదు చుండెను మానవుం; డదె
ట్లన, పఱువాతఁ బాల్పిటికి యావులనుందను, బాలకుండ కొ
మ్మున ఘటియించి, దానికయి మోయఁడె గొల్లఁడు ఱాయి! మిత్రుఁడా.

చ. వలఁతులకు న్విరోధములు వాటిలెనేని యుఁ, వారటుండఁగా,
నలఁతులకుం దటస్థమగు నాపద నద్ది; నదెట్టు లన్న, మం
దల నొకయావుకోసరము దాఁక గణిల్లని అంకె వేయుచుం
బలితపు టెడ్లు, లేఁగలకు భంగము గల్గును గాదె? మిత్రుఁడా. 208

చ. అనిశము నాతఁ డిట్టిఁ డగు, నట్టినిఁ గా నెదిరిం దలంచెడున్
మనసునఁ బ్రాయికంబు గను మానవుఁ; డియ్యది యెట్టు లన్నచో,
ననుపమవేగధూమశకటాంతరసుస్థితుఁ డైనవాఁడు తాఁ
జనుచుఁ దలంచుఁ గాదె తరుసంఘము వోయెడు నంచు? మిత్రుఁడా.

ఉ. దీనుల కెల్లయర్థముల దిక్కుమకుందుఁ డె; వారియక్కఱల్
తానె యెఱింగి తీర్చుచును; దైవముదృష్టికి సర్వ మొక్కఁడే;
మానవు లందఱుం దమదుమానముకై ధరియింపఁ జేలముల్,
మానుగ వాలముల్ తెలివి మాలుమృగంబుల కీఁ డె? మిత్రుఁడా.

ఉ. మంచి యుఁ జెడ్డ యుం జనసమాజమువర్తన నాశ్రయించి దీ
పించుచుఁ, గాలభేదమున భేదము నొందుచు నుండు నెవ్వి యుం;
బ్రాంచిత మంచు మున్నడచుబాట యిటీవల రూపు మాసి, మున్
గంచెలు ముండ్లు గండ్లు గలకానన సహాటము గాదె? మిత్రుఁడా. 21

## గద్యము.

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర
హారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తా
ఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ
సుబ్బరాయ నామధేయవిరచిత మగుసూక్తి
వసుప్రకాశికమునందు సర్వంబును
ద్వితీయభాగము. శ్రీ శ్రీ



# వసురాయకవికృత గ్రంథములు.

పుస్తక భాండాగారములను స్థాపించిన వారలకెల్లరకు మా యొద్దనుండిన గ్రంథములన్నియు సగము వెలకే ఇయ్యఁబడును. ఇదియే మావలన వారికిఁ గలుగు నుపకారమని యెఱుఁగునది.

| | | ర. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1 | అభిజ్ఞానశాకుంతలము. (లఘుటీకాతాత్పర్యవిమర్శ సహితము.) | 1 | 0 | 0 |
| 2 | వేణీసంహారము. (F. A. text for 1895 and and B. A. text 1900) | 1 | 0 | 0 |
| 3 | మల్లికామారుతప్రకరణము (శృంగారరస ప్రధాన నాటకము. [M. A. text for 1912] | 1 | 0 | 0 |
| 4 | ప్రబోధచంద్రోదయనాటకము (శాంతరసప్రధానము) విద్వాన్ పరీక్షకుఁ బఠనీయముగా 1912 for 1917 వఱకు నేర్పఱుపఁ బడినది. | 0 | 10 | 0 |
| 5 | చండకౌశిక నాటకము (హరిశ్చంద్రకథ), B. A. text for 1903. ... ... | 0 | 8 | 0 |
| 6 | విక్రమోర్వశీయనాటకము (శృంగారరసప్రధానము) | 0 | 8 | 0 |
| 7 | సూక్తివసుప్రకాశకముఁ లోకదృష్టాంతసమన్విత నీతిపద్యగ్రంథము 1892, 1893 సం॥ మెట్రిక్యులేషన్ పరీక్షకును 1918 సం॥ నాల్గవఫారమ్ పరీక్షకును బఠనీయగ్రంథముగా నేర్పఱుపఁబడినది). 4 వ కూర్పు ... ... | 0 | 12 | 0 |
| 8 | సుగుణప్రదర్శకము (నీతిపద్య గ్రంథము) 1వ ఫారమునకుఁ బఠనీయముగా నేర్పఱుపఁబడినది. | 0 | 4 | 0 |

| | | | |
|---|---|---|---|
| 9 భక్తచింతామణి (పండితభక్త మనోహరము) 6 వ కూర్పు. | 0 | 5 | 0 |
| 10 భక్తచింతామణిదర్పణము. (చింతపెంట వేంకటరమణయ్యా విరచితము). ... ... ... | 0 | 2 | 0 |
| 11 భగవత్కీర్తనలు (క్రొత్తకూర్పు భక్తజనమనోహరము)... | 0 | 1 | 0 |
| 12 నందనందనశతకము (రెండవకూర్పు విష్ణుభక్తానందకరము) | 0 | 2 | 0 |
| 13 దైవభక్త్యుపన్యాసము ... ... ... | 0 | 3 | 0 |
| 14 ఆంధ్రమేఘసందేశము (విప్రలంభ శృంగారవర్ణనము కాళిదాస మహాకవి విరచితమునకుఁ దెలుఁగు) ... ... | 0 | 5 | 0 |
| 15 సూర్యశతకము (మయూరకవివిరచితమునకుఁ దెలుఁగు)... | 0 | 6 | 0 |
| 16 భామినీవిలాసము (పండితరాయవిరచితమునకుఁదెలుఁగు).. | 0 | 10 | 0 |
| 17 సతీస్మృతి (కరుణరసభూయిష్ఠము. 2 వ కూర్పు.) | 0 | 4 | 0 |
| 18 సుతస్మృతి(కరుణరసభూయిష్ఠము. కృష్ణాయాపదుద్ధారకా! యనుమకుటముగల భక్తివైరాగ్యజనకశాంతిపాఠపద్య శతకముతో ముగింపఁబడినది). | 0 | 4 | 0 |
| 19 గౌతమీమహాజలమహిమానువర్ణనము, 2 వ కూర్పు. | 0 | 2 | 0 |
| 20 సుమనోమనోజ్ఞము (భారతవచనము) 3 భాగములు కలసి కవిగారిచిత్రపటముతో వున్నది. 3వ కూర్పు | 1 | 0 | |
| 21 విశ్వరూపస్తవము, నృసింహపంచాశిక. | 0 | 2 | |
| 22 వసురాయచాటూక్తిముక్తావళి. | 0 | 12 | |
| 23 గ్రామ్యపద ప్రయోగమునుగూర్చి ఆంధ్ర సాహిత్య పరిషత్తునకుఁ బంపిన వ్యాసము | 0 | 1 | 6 |
| 24 ఆంధ్ర శాకుంతల విమర్శననిరసనము. తోలేటి వేంకట సుబ్బారాయకృతము | 0 | 4 | 0 |

☞ ఏవిషయమునకైనఁ బ్రత్యుత్తరముకాని, పుస్తకముల పట్టీగాని కోరువారు తమ యుత్తరముతో నరయణాబిళ్ల పంపవలయును. పైగ్రంథములు వలయువారు రాజమహేంద్రవరమున రాజకీయకళాశాలయందాంధ్రపండితులగు వడ్డాదిసుబ్బారాయఁడుగారికి వ్రాయవలయును.

# ఆంధ్ర సారస్వత నికేతనము
## రాజమహేంద్రవరము.

—————:(O):—————

మనోహరము లైన నవలలు, నాటకములు, మహాపురుషుల జీవితములు శాస్త్రవిషయక గ్రంథములు మున్నగు ఉపయోగకరమైన తెలుఁగు గ్రంథములు ప్రకటింపఁ బడుచున్నవి. అందు కొన్నిగ్రంథములు దొరతనము వారిచే పాఠశాలాయోగ్యములుగ చేయబడుచుండుటచేత మాగ్రంథములకు శాశ్వతపుచందాదారు లై యుండుటవలన పాఠశాలలో చదువు మీబాలురకు సులభముగ గ్రంథములు దొరుకుటయేగాక మంచి నీతి, జ్ఞానము, తలిదండ్రులయెడల భక్తిశ్రద్ధలు, సత్కార్యములయందు పట్టుదల, స్వశక్తి వలన విజయము మున్నగునవి అలవడక మానవు.

(1) నాలుగణాలు ప్రవేశరుసుముక్రింద నిచ్చి మే మింతటినుండి రెండునెలల కొకమారు ప్రకటించు గ్రంథములన్నియు కొనువారు శాశ్వతపుచందాదారులు.

(2) యుద్ధమువలన కాగితమువెల యెన్నోరెట్లు పెరిగినను నూరు పుటలకు అరణాలవంతున డెమ్మీ మున్నగు పెద్దపెద్దసైజులలో ప్రకటింపఁబడుగ్రంథములుకూడ చందాదారులకు సకాలములో వి. పి. గా పంపుచు పోస్టుఖర్చులు మేమే భరించుచున్నాము.

(3) రెండుమారులు వి పి. త్రిప్పివేసినవారు అర్థరూపాయి ప్రవేశరుసుముయిచ్చి శాశ్వతపుచందాదారులు కావలసి యుండును.

(4) చందాదారు లిదివఱకు వెలఁవడిన గ్రంథము లన్నియు కొననవసరము లేదు. వారి కిష్టమయినవాటిని కొనవచ్చును. చందాదారులకు ప్రతి దసరాకును గ్రంథబహుమతి నిచ్చుటయే గాక అప్పటప్పటి మంచిమంచి గ్రంథములు, చిత్రపటములు, విచిత్రవస్తువులుఁకూడ బహుమానముగ పంపుచున్నారము.

(5) చందాదారు లీక్రిందిగ్రంథములలో వారి కిష్టమయినవాటిని కొనవచ్చును. ఎంతచవుకగనున్నవో ఎంతవేగముగ ఖర్చయిపోవుచున్నవో జూడుడు. వెంటనే చందాదారులు కానిచో కాగితముల వెలలనుబట్టి పుస్తకముల ధరలును హెచ్చుచేయక తీరదు.

# వెలువడిన గ్రంథములు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| ♦చిత్రలేఖ | 0—8—0 | 0—10—0 |
| ♦రాజహంస | 0—12—0 | 1—0—0 |
| *దేవీప్రసన్నము | ఉచితము | 0—2—0 |
| శేషధర్మము | 0—3—0 | 0—4—0 |
| లలితకుమారి | 0—8—0 | 0—10—0 |
| శ్రీదేవి | 0—8—0 | 0—10—0 |
| *మొగలితూరుకైఫీదు | 0—1—0 | 0—1—6 |
| *పూసపాటివారి వృత్తాంతము | 0—6—0 | 0—8—0 |
| *కిమ్మూరుకైఫీదు | 0—1—6 | 0—2—0 |
| ♦బొబ్బిలిముట్టడి | 0—1—6 | 0—2—0 |
| *కోరుకొండకైఫీదు | 0—2—0 | 0—3—0 |
| *చామర్లకోటకైఫీదు | 0—3—6 | 0—4—0 |
| ♦సుభద్రాచలము ? | 0—3—0 | 0—4—0 |
| ప్రిణయసరణి | 0—12—0 | 1—0—0 |
| ♦ఘోరకలి | 0—2—0 | 0—3—0 |
| గుణరత్నావళి | 0—8—0 | 0—10—0 |
| ♦వికటవివాహము | 0—10—0 | 0—12—0 |
| పెద్దాపురసంస్థానము | 0—8—0 | 0—10—0 |
| శాంత | 0—6—0 | 0—8—0 |
| §దేశోద్ధారకులు | 0—8—0 | 1—0—0 |
| కమలాకుమారి | 1—0—0 | 1—2—0 |

♦ యీగురుతుగలపుస్తకములు ఖర్చయిపోయినవి.

* యీగురుతుగలపుస్తకములు కొద్దిగ నున్నవి.

§ స్కూలుఫైనలుక్లాసుకు 1948 సం॥ (Non-detailed) టెక్స్టు

వలయువారు

మేనేజరు, ఆంధ్రసారస్వతనికేతనము

రాజమహేంద్రవరము.

# లీలావతినవలలు.

(*This Cancells all Previous Issues*)

1. ఈనవలలు చరిత్రవిషయకములును, మనోహర కథాకల్పితములునై మనోరంజకములగుచు రెండునెలల కొకొక్కటిగాఁ బ్రచురింపఁబడుచున్నవి. ఇవి మిగుల చమత్కారముగను రసవంతముగను నున్నవని అనేకులు పెక్కు సదభిప్రాయముల నిచ్చుచున్నారు.

2. చందాదారులకు పుస్తకములన్నియు 100 పేజీలకు రు 0—4—0 చొ॥ వి. పి. గా పంపబడుచుండును. కాగి తము మనుపటికంటె నిపుడు కఱవు హెచ్చుటచే చందా దారులు ప్రస్తుతము పోస్టేజి భరింపఁబ్రార్థితులు.

3. చందాదారులుగాఁ జేరువారు ముందు యేజంటు వద్దగాని ఆఫీసులోగాని ప్రవేశరుసుము 0—4—0 చెల్లించి రశీదు తీసికొనవలెను. వెనుకటి పుస్తకములన్నియుఁ గొన లేని యెడల రు 2—0—0 ల వెలకలవి కొనిన చాలును. ఒకసారి వి. పి. త్రిప్పివేసినయెడల ప్రవేశరుసుము మరల చెల్లింపవలసియుండును.

4. నూతనగ్రంథము వెలువడునపుడెల్ల చందాదారులకు బహుమానపరీక్షలు సేయఁబడి యందుఁ గృతార్థులైన వారికి బహుమానము లొసంగఁబడును. పరీక్షావిధాన మా యాగ్రంథములలో ప్రకటన పూర్వకముగా వివరింపఁబడును.

5. ప్రతివాల్యూము సాధారణముగా 300 పేజీ లుండును గావున వెల 0—12—0 లుండును.

# వెలువడిన నవలలు.

—)o(—

(1) అళహసింగరి (2) శృంగారవల్లి (3) స్వర్ణకుమారి. (4) శారద (5) హమీరసింగు (6) మానసింగు (7) తారామాతి (8) సుశీల (9) కేసరి (10)రమణి (11) ప్రియాన్వేషణము.

---

## (12) సేతుపిండారి

ఇందు మహారాష్ట్రుల దుండగములు, తగ్గిపిండారుల బందిపోటు ఘోర కృత్యములును, వాటిని నివర్తింప నాంగ్లేయుల పరిశ్రమములును చక్కగా వివరింపఁబడినవి. ఇదిచదివినవారికి పూర్వకాలచరిత్రము బాగుగా తెలియఁగలదు. వెల చందాదారులకు రు 0—10—0. ఇతరులకు రు 1—0—0

---

## (13) విక్రమసింహ

ఇది మిగుల చమత్కారమైననవల. చదువ నారంభించినది మొదలు ముగియు నంతవరకును పుస్తకము విడువబుద్ధి పుట్టదు. భార్యకొఱకై విక్రమసింహుడు పడినపాట్లును, అతనివిదేశసంచారమును నచ్చటచ్చట నేర్చిన విశేషాంశములను చదివితీరవలెను.

వెల చందాదారులకు రు 0—8—0. ఇతరులకు 0—12—0.

---

## (14) పురంజయ

లోకప్రసిద్ధిగాంచిన రైనాల్డ్సు దొరవారి కెన్నెత్ (Kenneth) అనునవలనుండి యనువాదింపబడినది. ఇందలి ప్లాటు, కథాచమత్కారము మిగుల మనోరంజకములు. ఈగ్రంథకర్తగారి నవల లన్ని దేశంబుల మెప్పువడయుచున్నవగుటచే వేరే చెప్పవలసిన అగత్యము లేదు.

వెల చందాదారులకు రు 0—12—0 ఇతరులకు రు 1—2—0.

అడ్రెస్:—మేనేజరు లీలావతీ గ్రంథమాల.

రాజమండ్రి గోదావరిజిల్లా.

